**SHELIME**

Literary Essays by
**RUKNUDDIN**

November, 2006

**Copies - 1000**



Cover Design
**HARI**

Printing
**SRI SAI PROCESS**
Narayanaguda, Hyderabad
Phone : 040-27563075, 27561981

***For Copies***

**GHALIB MANZIL**
4-123/E/56, Swaroopnagar,
Uppal, Hyderabad - 500 039
Phone : 040-27202800

**NAVODAYA**
Opp : Aryasamaj Mandir,
Kachiguda, Hyderabad.

**Price : Rs. 60/-**

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సాయం పొందిన పుస్తకం

# అంకితం



అమ్మ తర్వాత అమ్మ
నాన్న తర్వాత నాన్న
మా యన్న 'బాబు'కు

# కైమోడ్పులు

ఈ సంపుటిలోని వ్యాసాలన్నీ ఆయా సెమినార్లలో చదువబడినవో, రేడియో, టీవీల్లో ప్రసారమైనవో, అయినా ఆయా సాహిత్య సంచికల్లో ప్రచురించబడి, ఇపుడీ శెలిమె ద్వారా సాహిత్య పిపాసుల ముందుకు వస్తున్నవి.

ఈ వ్యాసాలకు ప్రసార ప్రచురణావకాశం కలిగించిన వారందరకూ ధన్యవాదాలు.

ఈ సంపుటీ కుటీరానికి అందమైన పందిరివేసి అలంకరించిన ఆత్మీయులు అమ్మంగి వేణుగోపాల్ (డా॥) గారికి, పరిచయానికి పరిమళాన్ని పులిమి చిత్రీకరించిన అనురాగ మిత్రులు అప్పంపాండు (డా॥) గారికీ, కృతజ్ఞతలు.

ముఖచిత్రాన్ని నఖ శిఖ పర్యంతం ఔచితీవంతంగా తీర్చిదిద్దిన వినయశీల విద్యార్థి హరికి అభినందనలు.

పుస్తకానికి పూర్ణాకృతి వచ్చేలా ముద్రించిన శ్రీసాయి ప్రొసెస్ అధినేత, సహృదయులు రాజశేఖర్ రెడ్డి, ఇతర సహోద్యోగులకు ప్రశంసలు.

ఈ సంపుటి ప్రచురణకు ఆర్థిక సహాయ మందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి నతులు.

భృతినిచ్చి, గతినిచ్చి, కారుమేఘాల కలుషాలు కమ్మినా, చిమ్మినా, నేను నేనుగా నిలువడానికి ఊతమిచ్చి నిలిచిన ఉస్మానియా విశ్వవిద్యాలయానికి కృతజ్ఞతాభి వందనములు.

అమ్మ తర్వాత అమ్మై, నాన్న తర్వాత నాన్నై

అనురాగాన్ని నాపై కురిపించిన 'అన్న'

ఉన్నా లేకున్నా, తిన్నా, తినకున్నా, నన్ను అక్కున జేర్చుకున్న

అన్న 'బాబు' కు ఈ పుస్తకాన్ని అంకితమిచ్చి కృతజ్ఞతలంటే సరిపోదు.

ప్రత్యక్షంగా పరోక్షంగా నా 'గతి'కీ స్థితికీ కారణమైన వారెందరో......

అందరికీ .....

**- రుక్నుద్దీన్**

# పందిరి

ఆచార్య కె. రుక్నుద్దీన్ రచించిన వైవిధ్యభరిత వ్యాస సంపుటి 'శెలిమె' పేరులోనే తెలంగాణాతనం, పాలమూరు ధనం కనిపిస్తుంది. ప్రాథమిక పాఠశాల మొదలు స్నాతకోత్తర స్థాయి వరకు అధ్యయన అధ్యాపనాల్లో అనుభవం గడించుకున్నవారు శ్రీ రుక్నుద్దీన్. వ్యవసాయనేపథ్యం వున్న శ్రీ రుక్నుద్దీన్ 'జానపదసాహిత్యంలో అలంకారం'. అన్న అంశం మీద పరిశోధన చేసి డాక్టరేట్ పట్టా పొందటం సహజమైన పరిణామం. పాఠాలు చెప్పటానికి విశ్వవిద్యాలయానికి వెళ్ళినా పొలానికి వెళ్ళే రైతే వారిలో నాకు కనిపించేవాడు. వ్యాసం రాసినా, కవిత్వం రాసినా తొలకరి చినుకుల మట్టివాసన కవి సమయమై గుబాళిస్తుంది.

ఇప్పటికే వారు తమ వ్యాసాలను, కవితలను పుస్తక రూపంలో వెలువరించారు. 'శెలిమె' వారి ఎనిమదో పుస్తకం.

ఆచార్య కె. రుక్నుద్దీన్ జానపద సాహిత్యం లోతుపాతులు తెలిసిన పరిశోధకులు కావటంతో ఈ సంపుటిలోని అన్ని వ్యాసాలలో జానపద జీవలక్షణం తరతమ భేదాలతో కనిపిస్తుంది.

'జానపద గేయాలు : జనజీవన విధానాలు' అన్న వ్యాసంలో ప్రస్తావనకు వచ్చిన అనేక గేయాలను వారు వ్యాఖ్యానించిన తీరు ఇందుకు నిదర్శనం. "వానల్లు కురవాలి వాన దేవుడా" అన్న పాటను పేర్కొని 'పాడాలనీ, రాయాలనీ యత్నిస్తే వచ్చింది కాదీ గేయం' అంటారు. జానపదుల జీవితావసరాల నుంచి, మానసిక ఆవేశ ఆవేదనల నుంచి సహజ వ్యక్తీకరణలుగా వచ్చేవే జానపద గేయాలన్న విశ్వాసం ఉన్న వ్యక్తి తప్ప ఇతరులు ఇంత నిర్ద్వంద్వంగా చెప్పలేరు. జానపదుల సంస్కృతీ సంప్రదాయాలను కూడా డా॥ రుక్నుద్దీన్ సాధికారంగా చెప్తారు. కరువు రోజుల్లో కప్పను తలకిందులుగా కట్టి ఊరేగించటం వెనుక వున్న విశ్వాసాన్ని వివరించిన తీరు ఎంత మనోజ్ఞమో అంత హృదయస్పర్శి. పెండ్లి పిల్లను అప్పగించేటప్పుడు పాడే పాటలో

"మల్లీయా పూవోలే మేం బెంచినాము

మామాగారి చేతుల్లా పెట్టే యాల్లాయే"

వంటి చరణాలను దృష్టిలో వుంచుకొని ఆచార్య రుక్నుద్దీన్ :

'మల్లెపూవు కోమలమైంది .... అమ్మాయి కూడా అంతే. అందువల్ల సుకుమారంగా, కోమలంగా, ప్రేమగా వాడుకొని జీవితాన్ని పరిమళభరితం, సుఖవంతం చేసుకొమ్మనే

సందేశం యీ గేయంలో వుందంటారు. మల్లెపూవు ఇక్కడ నవవధువు శరీరము, మనసు కూడా. జానపదగేయాల్లో ప్రబోధాత్మక శక్తికి లోటులేదు. ఒక అధ్యాపకుని పాత్రను అవి పోషించాయి.

'కాముని పండగ' వ్యాసంలో పండుగలకు దారివేసే ఆలోచనాధారను ప్రస్తావించి, ఈ పండుగ వెనుక వున్న శివపార్వతీ మన్మథుల పౌరాణిక గాధను వ్యాసకర్త వివరిస్తారు. పల్లెపట్టు తేనెపట్టుగా వున్న పండుగలలో కాముని పండుక ప్రత్యేకమైంది. విందువినోదాలు, అగ్ని జ్వాలల వెలుగులు, రంగుల హరివిల్లులు, వెరసి కాముని పండగ, వీధుల్లో ఎక్కువగా జరుపుకొనే సామాజిక ఉత్సవం ప్రపంచంలోని ఇతర దేశాల్లో జరుపుకునే 'ఫైర్ ఫెస్టివల్స్' ఈ కోవలోకి వస్తాయంటున్నారు డా॥ రుక్నుద్దీన్.

"బసువంత దెచ్చినాడే ఓలీ"

"జొన్నాగింజా బంగారమాయె"

"జోజెర జోజెర గాజుల పాపా"

వంటి పాటల ఆధారంగా పండుగ వైశిష్ట్యాన్ని డా॥ రుకున్నద్దీన్ వివరించారు.

"కాముని పున్నమ సందర్భంగా పాడే చాలా పాటల్లో 'శెమ్మ కేలిల ఓలీ' - అనే వూతపదం వుంటుంది. 'శ్యాం ఖేలెరె హోళీ' అనే హిందీ వాక్యానికి యిది వికృత రూపం కావచ్చునని విమర్శకులంటున్నారు" అన్నది వ్యాసకర్త అభిప్రాయం. 'శ్యాం' అన్నది కృష్ణుని పేరైతే పౌరాణికంగా ఈ పండుగ మూలానికి అతనికీ సంబంధం లేదు. ఆయన వెన్న ముద్దలతో వేడుక చేసుకున్నవాడు. 'సాయంత్రం' అన్న అర్థంలో అయితే మరి ఇది రాత్రి పండుగ. ఉదయం నుంచి మధ్యాహ్నం దాకా రంగులు చల్లుకునే పండుగ. దేశీయమైన పాటల మూలాలు ఆయా నిసర్గ నేపథ్యాలలో వెతికితే దొరకకపోవు. బహుళ ప్రచారంలో వున్న పాటలకు బహుపాఠాంతరాలు వుంటాయి. జిల్లాల వారీగా సేకరించి పరిశీలిస్తే రంగు బయటపడుతుంది.

పరిశోధకునిగా ఆచార్య రుక్నుద్దీన్ పురివిప్పుకున్నది 'ఉగాది' అన్న వ్యాసంలో. ఇది కాముని పండుగ లాగా పూర్తి జానపద లక్షణాలున్న పండుగ కాదు. పాక్షికంగా ఇది నాగరిక స్వరూపాలు స్వభావాలున్న పండుగ. ఉగాది శబ్దవ్యుత్పత్తిని, ఆ పండుగ జరుపుకోవడానికి గల మూలకారణాలను గూర్చి వ్యాసకర్త విస్తృతంగా చర్చించాడు. ఇందుకు పాశ్చాత్య ప్రపంచంలోకి కూడా వెళ్ళి 'ఓవిడ్ - జానుస్‌ల చర్చ'ను కూడా ప్రస్తావించారు. 'యుగాది' అన్న అర్థంలో సృష్ట్యాది భావనను కాకుండా, వసంత రుతువు ప్రకృతిలో, మానవ ప్రకృతిలో తెచ్చే మార్పును' 'ఉగాది' పండుగకు మూలం అని డా॥ రుక్నుద్దీన్ చెప్పటం జానపద దృష్టికి అనుకూలంగా వుంది. వివిధ ప్రాంతాలలో ఈ పండుగను జరుపుకునే తీరుతెన్నులనూ వారు వివరించారు. పంచాంగ శ్రవణం గూర్చి, రైతులు వ్యవసాయపు పనులను లాంఛనంగా ప్రారంభించే సంప్రదాయం గూర్చి ప్రస్తావించారు. ఇంతటితో ఆగకుండా తెలుగు కవులు విశ్వనాథ, దాశరథి, సి. నారాయణ రెడ్డి తమ తమ కవితలలో జరుపుకున్న అక్షర ఉగాదిని ప్రశంసిస్తూ, వ్యాసానికి సముచితమైన ముగింపునిచ్చారు.

సుప్రసిద్ధ కవి పండితులు 'సరస్వతీపుత్ర' పుట్టపర్తి నారయణాచార్యుల వారు రచించిన 'మేఘదూత' కావ్యం గూర్చిన వ్యాసం ఈ సంపుటికి నిండుదనాన్నిచ్చింది. అన్యాయాన్ని అన్యాయం అనటం అన్న నేరం చేసినందుకు జైలుపాలైన యువకుడు సుదూరంగా వున్న తన ప్రియురాలికి మేఘంద్వారా సామాజిక స్పృహ కలిగించే సందేశాన్ని పంపటమే ఈ కావ్యేతి వృత్తం. కర్షకకార్మికుల పక్షం వహించి, వారి కడగండ్లను ప్రతిబింబింప జేయటం మూలంగా పుట్టపర్తివారు వస్తువరణంలోనూ, కావ్యనిర్వహణంలోనూ సమకాలీనులకన్నా ముందున్నారు. తెలుగు సంస్కృతాలలో దూతకావ్యాలకు కొదవలేదు. ఈ కోవకు చెందిన మరికొన్ని కావ్యాలలో ఈ కావ్యానికి వున్న సాదృశ్యవైదృశ్యాలను పరిశీలిస్తూ ఎవరైనా పరిశోధన చేస్తే, అది మంచి తులనాత్మక పరిశోధన అవుతుంది.

కొడాలి వేంకట సుబ్బారావు రచన 'హంపీ క్షేత్రం' కావ్యపరిశీలన ఆచార్య రుక్నుద్దీన్ శక్తియుక్తుల ప్రదర్శన క్షేత్రం. పలుమార్లు శిథిలావస్థలో వున్న హంపీక్షేత్రాన్ని సందర్శించి, ప్రతి సందర్శనలో ప్రోదిచేసుకున్న సంస్పందనలకు అక్షరరూపం ఇచ్చిన కవి మనస్వితకు ఉత్తమ నివాళి ఈ వ్యాసం. పురాతత్వశాస్త్రవేత్త జాగ్రత్తగా ఒక్కోపొరనే తవ్వుకుంటూ చరిత్ర లోతుల్లోకి వెళ్ళినట్లు, డాక్టర్ రుక్నుద్దీన్ ఈ కావ్యంలో నిక్షిప్తమైన రాయలు - తిమ్మరుసుల ప్రేమానుమానాల అనుబంధం, చరిత్ర, క్షేత్రప్రశస్తి, స్మృతికావ్యలక్షణం - వంటి పొరలను విప్పి చూపటంలో కృతకృత్యులయ్యారు.

వైయక్తిక సామాజిక స్థాయిలలో అగ్రకులవైషమ్యానికి బలయిన దళితులపక్షాన మొక్కవోని సాహసంతో ప్రద్యాగ్రహం ప్రకటించినవారు జాషువా. కందుకూరి యుగంలో సాహిత్యం ద్వారా సంస్కారసాధనకు కృషిచేసిన వాడు గురజాడ అయితే, తదనంతరకాలంలో ఆ కృషిని మరింత చైతన్యంతో ముందుకు తీసుకుపోయినవాడు జాషువా. వడిసెల నుంచి రాయిలా, విల్లు నుంచి బాణంలా, తుపాకి నుండి గుండుగా, గుండెలో నుంచి దూసుకొచ్చిన మాటలు ఆయన పద్యాన్ని నాలుగంచుల వజ్రాయుధంగా మలిచాయి. అనుభవ మూలాల నుంచి దూసుకొచ్చిన మాటలకు పర్యాయపదాలు వుండవని ఆచార్య రుక్నుద్దీన్ అభిప్రాయం.

'పిరదౌసి'లోని 'అల్లాతోడని పల్కినా పసిడి కావ్యద్రవ్యమున్ వెండితో/చెల్లింపన్ దొరకొన్న టక్కరివి' సుప్రసిద్ధ పద్యంలోని 'టక్కరివి' అన్న మాటకున్న బలం మరోమాటకు

లేదంటారు. జాషువా రచనలైన ఫిరదౌసి, ముంతాజ్ మహల్, జెబున్నిసా, క్రీస్తు చరిత్ర - మొదలైన కావ్యాల ఇతివృత్తాలు సీమాంతరాలు కావటంతో, ఉర్దూ, పారసీ, ఇంగ్లీషు పదాలను జాషువా విరివిగా వాడక తప్పలేదని గుర్తించారు. 'పరభాషాపదాలు తెలుగులో ఒదిగినంత బాగా మరో భారతీయ భాషలో ఒదగవేమో 'నన్న జెబిస్ హెల్బన్ పండితుని అభిప్రాయం అనుభవైక వేద్యమే. 'గవ్వకు సాటి రాని', 'గోటికి మీసము చిక్కుట' వంటి జాతీయాలను ప్రయోగించటం ద్వారా తన కవిత్వంలో జాషువా తెలుగుదనానికి పట్టం కట్టారని వ్యాసకర్త గుర్తించారు. భారత పాత్ర 'శిఖండి'ని 'అతడాడుది' అంటూ ఉభయలింగత్వంతో రూపింప జేయటంలోని చమత్కారాన్ని కూడా వ్యాసకర్త ప్రశంసించారు.

"నా కవిత్వంబునందు రత్నములు కలవు

వాని బెకలించి చూచెడు వాడు లేడు"

అని జాషువా 'సమకాలమువారలను' దృష్టిలో వుంచుకొని అన్నా, తదనంతకాలంలో వారి రత్నాలకు విలువ కట్టే ప్రయత్నం కొంత జరిగింది. జాషువా తిరుగుబాటు తత్వాన్ని సామాజిక కోణం నుంచి విరివిగానే విశ్లేషించారు. అయితే, వారి సమగ్ర సాహిత్య వ్యక్తిత్వం మీద జరగవలసినంత కృషి జరగలేదన్నది సత్యం. పేరుకోసమో, పెన్నిధికోసమో రాయని జాషువా కావ్యాలకు 'పసిడి'తో వెలకట్టే పరిశోధన నిరంతరం సాగవలసిందే.

విశ్వనాథ 'కిన్నెరసాని' ఒక నిసర్గధార. ఆవేశ ఉద్రేకాల సంపుటి. పశ్చాత్తాపం సుడులు తిరిగి 'కరుణ యేవ ఏకోరసః' అన్న భవభూతికి పునర్జన్మనిచ్చిన అనుభూతి విశేషం. స్త్రీ పురుషుల విశ్వజనీన ప్రేమకు, వియోగానికి అచ్చమైన కావ్యరూపం. అయితే, పాషాణ హృదయం సలిల రూపాన్ని, విచలిత స్పందన పాషాణ రూపాన్ని పొందటం వ్యంగ్యం. అరుదైన ఈ కావ్యాన్ని మానవసంబంధాల వెలుగులో పరిశీలించిన ఆచార్య రుక్నుద్దీన్.

'నదిని రక్తమాంస శరీరయైన నాయికగా భావించి పాడిన పాటలు మాత్రమే కావు కిన్నెరపాటలు; సంపూర్ణ జీవన విధానానికి ప్రతీకల నెత్తిన ప్రతిభాపతాకలవి. కిన్నెర ఆవేశంతో యిల్లు వెడలడం; ఆమెకూ, ఆమె భర్తకూ తీరని నష్టాన్ని కలిగించింది. అని వ్యాఖ్యానించటం ద్వారా, ఆవేశపూరిత ఆత్మ త్యాగం రెండు నిండు జీవితాలను బలగొన్న సత్యాన్ని కళ్ళకు కట్టించారు.

'పాలమూరు లేబరు' వ్యాసం ఈ సంపుటిలోని ఇతర వ్యాసాలతో పోల్చి చూస్తే విలక్షణమైనది. నిజాం ఏలుబడిలో వెనుకబడిన తెలంగాణా జిల్లాలలో పాలమూరు ప్రాంతం అక్షరాస్యతలోనూ, ఆర్థికవనరులోనూ చివరిస్థానంలో వుందంటారు వ్యాసకర్త. వర్షపాతం తక్కువ కావటంతో ఆయా ప్రభుత్వాల ద్వారా కరువు ప్రాంతంగా కూడా ప్రకటింపబడుతూ వచ్చింది. ఈ కారణాల మూలంగా ఆ ప్రాంతం బడుగువర్గాల ప్రజలు కూలీలుగా మారక తప్పలేదు. వాళ్ళే పాలమూరు లేబరు. నిర్మాణ రంగానికి అసంఘటిత కార్మికుల పాత్ర గుండెవంటిది. పాలమూరు ప్రాంతపు అమాయక కార్మిక జనం తరతరాలుగా ఆంధ్రదేశంలో చిన్నా పెద్దా నిర్మాణాలలోనూ, దేశవిదేశాలలో బృహన్నిర్మాణాలలోనూ కీలక పాత్ర వహించిన సంగతి జగత్ప్రసిద్ధం. తక్కువకూలి, ఎక్కువపనితో పెట్టుబడిదారులు, వాళ్ళదళారీలు అదనపు విలువ సృష్టించుకున్నారు.

ఈ లేబర్ వ్యవహారమంతా మూడంచెలుగా సాగుతుందని వ్యాసకర్త పరిశీలనలో తేలింది.

భారీ నిర్మాణాలను చిన్న యూనిట్లుగా విభజించి చిన్నకంట్రాక్టర్లకు అప్పగిస్తారు. చిన్న కంట్రాక్టరు మేస్త్రీలను ఆశ్రయిస్తాడు. మేస్త్రీ మానవవనరులైన లేబర్‌ను సమకూర్చుతుంటాడు. బాల కార్మికులూ తల్లిదండ్రులతోపాటు కష్టాల కడలిలోకి అడుగుపెడ్తుంటారు. కంట్రాక్టరు సమకూర్చిన వాహనంలో దూరప్రాంతాలకు బయలు దేరుతుంటే -

"జర భద్రం కొడుకో
నా కొడుకో బౌంరన్న
జరాభద్రం కొడుకో
ఎక్కేతాన- దిగేతాన
తొవ్వేతాన - తొక్కేతాన"

వంటి పాటలు వినిపిస్తాయని ఆచార్య రుక్నుద్దీన్ చెప్తున్నారు. అలాగే కంట్రాక్టుతీరిన తర్వాత ఇంటికి తిరిగివచ్చిన కార్మికులు :

"ఉప్పులేని గంజి తాగితిమయ్యా
చొప్పకట్టెలోలె సొలితిమయ్యా"

అంటూ గడిచిపోయిన పీడదినాలను ఆవేదనతో గుర్తుకు తెచ్చుకుంటారు. శరీరంలోని సారాన్ని కాంట్రాక్టర్లు దోచేసుకోగా, తాము పిప్పిగా మిగిలిపోయామన్న వాస్తవం అనుభవ సారంగా మిగిలిపోతుంది. కాలం మారుతున్నా శ్రమదోపిడి పెరుగుతున్నదే కాని, తగ్గటంలేదు. 'హైటెక్' పద్ధతుల మూలంగా ఈ మధ్య పరిస్థితులు మరింత దిగజారాయి. అందుకే -

"ప్రభుత్వమూ, స్వచ్ఛంద సంస్థలూ పూనుకొని పాలమూరు లేబరు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించాలంటున్నారు" రుక్నుద్దీన్.

చారిత్రక నేపథ్యాన్ని ఆర్థిక సమాజశాస్త్రాలతో సమన్వయించి, సాహిత్య గంధం పూసి, ఆంతర శాస్త్ర పరిశీలనాంశంగా ఈ వ్యాసాన్ని రూపొందించిన ఆచార్య రుక్నుద్దీన్ అభినందనీయులు.

ఈ సాహిత్య వ్యాస సంపుటిలో కొంత ఆశ్చర్యం కలిగిస్తూ చోటు చేసుకున్నవి "అక్కినేని మరువలేని పాత్రలు : ఏడంతస్తుల మేడ" "దేవులపల్లి కృష్ణశాస్త్రి చలన చిత్ర గీతాలు" అన్న వ్యాసాలు.

తనకు నచ్చిన సినిమా గూర్చిన రచన సాహిత్య వ్యాససంపుటిలో చేర్చటానికి :

"సినిమా బలమైన ప్రసార సాధనంగా రూపొందింది. బహుళ జనాదరణ పొందిన కళగా సినిమా రూపుదాల్చ"డమే కారణంగా ఆచార్య రుక్నుద్దీన్ భావిస్తున్నారు. జనాదరణ పొందినది కళాత్మకంగా వుంటే, దాన్ని సాహిత్యాభిమానులు అనుశీలించాలని రచయిత కోరటంలో ఔచిత్యం వుంది. చలన చిత్రగీతకారుల సాహిత్యం మీద విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరిగాయి. పరిశోధకులు డాక్టరేట్లు కూడా సాధించారు.

ఈ వ్యాసం "ఏడంతస్థుల మేడ ఇదీ
వడ్డించిన విస్తరిదీ"

అన్న ప్రధాన పాటను, మహానటుడు అక్కినేని నటనను ఆధారం చేసుకుని నడించింది. ఇది 'అభిరుచి' కోవకు చెందిన వ్యాసం.

'దేవులపల్లి కృష్ణశాస్త్రి చలన చిత్రగీతాలు' అన్న వ్యాసం ఆ మహాకవి సాహిత్య వ్యక్తిత్వానికి, చలన చిత్ర గీత రచనావైశిష్ట్యానికి పందిరి వేసింది.

"జనవాణి"లో మల్లీశ్వరి పాటలను సమీక్షిస్తూ తాపీ ధర్మారావుగారు ఈ పాటలతో సినిమా సాహిత్యానికి కావ్యగౌరవం వచ్చింది అన్నారు" అంటూ పరిశోధనాత్మకంగా ఆచార్య రుక్నుద్దీన్ పేర్కొన్నారు. "ఆకాశవీధిలో హాయిగా ఎగిరేవు" అన్న బహుళ జనాదరణ పొందిన మల్లీశ్వరి పాటను ప్రతినిధి గీతంగా ఉద్ఘాటించి -

"మేఘమాలకు ఆపాదించిన ఈ లక్షణాలన్నీ కృష్ణశాస్త్రి గేయాలలో ప్రతిఫలిస్తాయి. అత్యున్నత విహాయస వీధుల్లో విహరించే కవిభావుకతకు ఇవి సంకేతాలు. శాస్త్రిగారి కవిత్వం లాగే ఇది సైతం నిర్భరము, మనోజ్ఞ గంభీరస్వర సంయుక్తము" అంటారు జలదనిస్వనంతో ఆచార్య రుక్నుద్దీన్.

"ఎంతవారు గాని, వేదాంతులైనగాని జానపద ప్రభావం నుండి జారుకోలేరనేది వాస్తవమే" అంటూ కాంతా సమ్మితత్వం గుబాళించే వ్యాఖ్యాచేస్తూ"

గోరింట పూసింది కొమ్మ లేకుండా"

అన్న జానపద గీత చరణాన్ని గ్రహించి చలన చిత్ర గీతంగా కృష్ణశాస్త్రి మలిచిన తీరును వివరిస్తారు. కృష్ణశాస్త్రి గీతాలలో రామునికీ కృష్ణునికీ చెందినవే ఎక్కువ అంటూ 'బంగారు పంజరం' వంటి సినిమాలలోని గీతాలను పేర్కొన్నారు. ప్రకృతి, ప్రణయ భక్తి గీతాలతో పాటుగా సామాజిక స్పృహ కలగిసిన పాటలను దేశభక్తి గీతాలను కూడా వెండితెరకు అంకితం చేసిన కవిగా కృష్ణశాస్త్రి వ్యక్తిత్వాన్ని అంచనా వేశారు. ఈ వ్యాస ప్రారంభ వికాసాల లాగే ముగింపు కూడా మనోజ్ఞంగా వుంది.

"ఒక సుందర దృశ్యాన్ని చూసినా, మధుర గీతాన్ని విన్నా, మనోహర కవిత చదివినా కృష్ణశాస్త్రి స్మృతి మనోవీధిలో తళక్కుమనక మానదు. ధన్యజీవికి అది చాలు!"

ఈ పది వ్యాసాలలో ఆచార్య కె. రుక్నుద్దీన్ పాఠకుడిగా, పరిశోధకుడిగా కనిపిస్తారు. మనస్వీగా, జిజ్ఞాసిగా కూడా కనిపిస్తారు. జానపద గేయానికి ప్రేమానురాగాలతో గూడు కట్టినట్లుగానే, పద్యగేయ కవితలకు భక్తిగౌరవాలతో గుడికడతారు. ఆచార్య రుక్నుద్దీన్‌కు ఆత్మీయ స్థానంలో వున్నది 'పాట'. సాహిత్య పాటసారిగా వారి ప్రస్థానం మునుముందుకు సాగాలని, అభ్యుదయమూ, లౌకికతత్వమూ చెరోకన్నుగా సాధించిన సమవీక్షణంతో చీకటి కోణాలను వెలిగించాలని ఆకాంక్షిస్తున్నాను.

8-8-2006

డాక్టరు అమ్మంగి వేణుగోపాల్

# ఇందులో .....



# జానపద గేయాలు జనజీవన విధానాలు

ఒక జాతి జీవన విధానమే దాని సంస్కృతి అనే విషయాన్ని పలువురు పలు విధాలుగా నిర్వచించారు. సహనమే సంస్కృతి అని ఒకరంటే, జాతి నడచిన అభ్యుదయ మార్గమే దాని సంస్కృతి యని మరొకరన్నారు. ఒక జాతి జీవన విధానంలో మంచి మాత్రమే ఆ జాతి సంస్కృతి అనబడుతుందని ఒకరంటే మంచీ చెడులను, ఇవింతే అని ఇదమిత్థంగా గిరిగీసి నిర్ధారించలేము, కాబట్టి ఒక జాతి జీవన విధానమే ఆ జాతి సంస్కృతి అని మరొకరన్నారు. నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం, అన్న వాక్యానిక విరుగుడుగా పరోపకారార్థమిదం శరీరమన్న ఉదాహరణలు, ప్రపంచ చరిత్రలో వున్నాయి. ఆ ఉదాహరణలే ఆ జాతి సంస్కృతి ప్రతిబింబాలౌతాయంటారు మరికొందరు.

ఏ జాతి జీవన విధానానికైనా, అందలి సాహిత్య ప్రక్రియలు ప్రతిబింబాలౌతాయి, కావాలి; అందులోనూ శిష్ట సాహిత్యం కంటె జానపన సాహిత్య మెక్కువ దోహదకారి అవుతుంది. జానపద సాహిత్యాధ్యయనం చేయనంత కాలం జాతి జీవన విధానం సమగ్రంగా తెలియదు. ప్రత్యేకించి మన తెలుగు జాతికి యీ విషయం వర్తిస్తుంది.

ఏడున్నర లక్షల గ్రామాలు మనవి. ఎనభై కంటె యొక్కవ శాతం జనాలు నివసిస్తున్న జనపదాలున్న దేశం మనది. మన దేశ ప్రజల జీవన విధానాలను ప్రతిబింబించేదే అసలైన జనసాహిత్యం.. మన సాహిత్యం; అదే జానపద సాహిత్యం.

జనం ఎట్లా వుంటున్నారు ఏం తింటున్నారు ఏం విశ్వసిస్తున్నారు ఎలా జీవిస్తున్నారు. ఎలా భావిస్తున్నారు కట్టేమిటి, బొట్టేమిటి, ఏం చేస్తున్నారు ఏం చూస్తున్నారు తిండీ తిప్పలు, ఆటా పాటా మాటా మొదలైన విషయాలను తెలిపేదే నిజమైన సాహిత్యం.

అట్లాంటి వారి పాటల్లో ప్రతిబింబించే జన జీవితాన్ని పరిశీలించడమే ప్రస్తుత ప్రయత్నం.

**వానల్లు కురవాలి వానదేవుడా**
**వరిచేలు పండాలి వానదేవుడా**
**మా యిల్లు నిండాలి వానదేవుడా**
**మా యమ్మ వండాలి వానదేవుడా**
**మా బొజ్జ నిండాలి వానదేవుడా!**

..............................................

**శెలిమె**

గ్రామీణ బాలబాలికల ఆటపాటల్లో తరచుగా వినబడే పాట యిది. పాటలోనే వారి పరిస్థితి తెలుస్తుంది వర్షం కురిస్తేనే గాని వారికి పంటలు పండవనే సత్యం పాపం పసిపిల్లలకూ తెలిసే ప్రాంతాలవి. వర్షాధార వ్యవసాయ క్షేత్రాలున్న ప్రాంతాలు. నీటి వసతులు లేని ప్రాంతాలు. అనకట్టలు కాలువలు లేని ప్రాంతాలు ఆ ప్రాంతాల వారికి వర్షం కురిస్తేనే పంట పండేది, వారి కడుపు నిండేది . అది గమనించిన చిన్నారులు తమ ఆటల్లో అలవోకగా అల్లుకొని పాడుకుంటున్న పాట యిది. పాడాలనీ రాయాలనీ యత్నిస్తే వచ్చింది కాదీ గేయం. వారి జీవితాలను జీవన విధానాన్ని కళ్లకు కట్టే గేయం.

వర్షాలు కురిస్తే పంటలు పండుతాయి. మరి వర్షం పడకుంటే!! కొన్ని ప్రయత్నాలు ప్రార్థనలు వర్షాలను తెస్తాయనేది జనం విశ్వాసం. ఈ విశ్వాసం రకరకాలుగా వుంటుంది సకాలంలో వర్షాలు కురవక పోతే గ్రామ పెద్దలు పండితుల చేత విరాటపర్వ పారాయణం చేయించి, అది ముగిసిన రోజు వరదపాశం (పరమాన్నం) చేయించి, గ్రామ సమీపంలోనీ బండలపై పోసి ఆ వూరి గొల్లబోయీనితో నాకిస్తారు; అది వర్షాగమనానికి కారణమవుతుందని వారి విశ్వాసం.

విరాట పర్వ పారాయణంతో వర్షం రానపుడు

**కప్పమ్మ నీళ్ళాడె**
**కాల్వలెండీపాయె వానదేవో**
**వానదేవ !**
**ఇగనన్న కురువావు**
**జగమేలు తలిదండ్రీ**
**వానదేవ!**

అంటూ ప్రార్థిస్తూ వాడవాడలా కప్పకావడిని పూరేగించడం జానపదులకు మామూలే ఆ ప్రయత్నం తప్పక వర్షాల్ని కురిపిస్తుంద నేది జానపద విశ్వాసం. కప్పకాళ్లకు తాడుగట్టి పొడవైన కట్టెకు కప్పను తలకిందులుగా వేలాడదీస్తారు. పసుపునీరు చిలకరించిన వేపమండలు కప్పకు ఎండ తగులకుండా వుంచుతారు. ఆ పొడవైన కర్రను రెండు వైపులా ఇద్దరు భుజాలమీద పెట్టుకొని మోస్తూ పై గేయాన్ని పాడతారు. వెంటవున్న చాలమంది ఈ పాటనందుకొని వారూ పాడతారు. చాలా గ్రామాలలో బాలికలు మాత్రమే యీ పూరేగింపులో పాల్గొంటారు. అక్కడక్కడా మగపిల్లలూ వీరితో చేరతారు.



ఉభయ చరమని దానికి పేరున్నా, కప్ప చాలావరకు నీళ్లలోనే వుంటుందనాలి నీరు లేకపోతే దానికి జీవితం లేదు. ప్రత్యుత్పత్తి అంతకంటే లేదు.

పాపాత్ములున్న ప్రాంతాల మీద వానదేవుడు వర్షం కురిపించడు. పాప పుణ్యాలు మానవులకు మాత్రమే గాని పశు పక్ష్యాదుల కుండవు. అందుకని నీటిమీదనే ఆధారపడే కప్ప నీళ్ళాడింది. తల్లి కప్పే కాదు, పిల్ల కప్పలూ మలమల మాడే పరిస్థితి వచ్చింది. కనీసం వాని మీదనైనా కనికరించి వర్షం కురిపించమని, ప్రాధేయ పడుతున్నారు జానపదులు.

పక్కనుండి పారే యేటి నుండి 'యేతాం'తో నీరుతోడి, పంటలు పండించినాడు రైతు. ఏతమెత్తి పంటలు పండించేటపుడు పారేది నీరో, లేక వాని చెమటో చెప్పలేం. అంత కష్టపడి, కండలు కరిగించి, నీరు పారించి చేలు పండించినా, 'యై' పుట్ల దిగుబడి సాధించినా ఒక మెతుకు మందమైనా ఫలితం వానికి దక్కని సందర్భాలు బాధను కలిగిస్తాయి.

**ఏటికేతం బెట్టి**
**యై పుట్లు వండిస్తె**
**ఎన్నడూ మెతుకెరుగరన్నా**
**నేను**
**గంజిలొగ మెతుకెరుగరన్నా!....**

అనే గ్రామీణ రైతు దీనావస్థను తెలిపింది గేయం. ఆ రైతు భార్య గయ్యాళిదనీ, గట్టిగా తను వండుకొని తిని, భర్తకు గంజ మాత్రమే పోసిందనీ, కొంతమంది వ్యాఖ్యానిస్తారీ గేయం చదివి. అది సమంజసం కాదు. ఇక్కడ కనపడేది శ్రమ దోపిడి. తానెంత పండించినా నాగులు, మిత్తీల పేర షావుకార్లు తన ధాన్యాన్నంతా కొలుసుకొనిపోతారు. ఇది లైసెన్స్‌డ్ దోపిడి. జానపదుల అమాయకత్వం విశ్వాసం మీద చేసే దోపిడి. దానికి కట్టుబడి తన సర్వస్వం, ఆరు నెలల శ్రమ అయ్యగారి బండిలో తరలిపోతుంటే.

**నాదేమి బతుకాయెరన్నా**
**నేను**
**నాడె సావకపోతిరన్నా!**

అని కుమిలిపోతాడు, ఇటువంటి విషయాలను తెలిపేదే మరోగేయం.

**జొన్నెరడుగావోతె జొనగింజ దొరికే,**
**జొనగింజ పేరేం? ...మెంటేపిరాజు,**

మెంటేపిరాజూన్ దింటీమిరన్నా!
అప్పరెడ్డి పల్లెకోతీమ్ రన్నా!
వైనైనెడ్లాన్ దెస్తీం రన్నా!
ఆర్సికొడ్తే అరవై పుట్లూ
ఈడ్సికొడ్తే ఇరవైపుట్లూ
అన్ని గూడ వోస్కునె గుగ్గిల్ల శెన్నయ్యే
గాసమియ్యామంటె మీసాల్ దువ్వడు,
మూలవాసం దీస్క ముడ్డిర్గ గొడ్తె
ముడ్డీకి వట్టిందడ్డెడు నూనె
అడ్డెడు నూనెకు పైకాం లేదు,
పైకాం లేకుంటే పయెదాన్నమ్ము
పయెదాన్నమ్మితె బండికి లేదు
బండికి లెకుంటె మొండిదాన్నమ్ము
మొండిదాన్నమ్మితె మోటకు లేదు
మోటకు లేకుంటె హాల్నమ్ము
హాల్నమ్మితె అర్కకు లేదు
అర్కకు లేకుంటె కోడ్నమ్ము,
కోడ్నమ్మితె గుడ్డుకు లేదు.
గుడ్డుకు లేకుంటే గుద్దుక సావు

..........................

నేరుగా కల్లంలోకి బండితోలుకొని వచ్చి, నాగుకు నాగు, మిత్తికి మిత్తి, వడ్డికి వడ్డీ, లెక్కలు చూపి, పండిన పంటనంతా బండిలో నింపుకొని పోయినాడు గుగ్గిల్ల శెన్నయ్య (షావుకారు). తిరిగి గాసమియ్యమని అడిగినాడు రైతు. షావుకారు మీసం దువ్వినాడు. అంటే ధాన్యం అప్పుగా యివ్వనన్నాడు. విధి లేని పరిస్థితిలో తిరుగ బడ్డాడు రైతు. షావుకారుకు గాయమయింది. ఆ గాయానికి చికిత్స చేయించవలసిన బాధ్యతను రైతుపై వేసింది సమాజం. (షావుకారు రైతు జీవితాన్నే గాయం చేస్తే పట్టించుకోదీ సమాజం). చికిత్సకు కావలసిన 'ధనం' రైతువద్ద లేదు. అందుకని తన పసులనమ్మ మంటుంది, భార్యనమ్మమంటుంది, అమ్మలేకపోతే 'గుద్దుక సావు' అన్నది. నేటి రైతు, ప్రత్యేకించి పత్తిరైతు దీనావస్థ, నిస్పహాయత స్ఫురిస్తుంది దీనివల్ల. రైతుగతి ఆనాడూ ఈనాడూ 'అమ్మపోతె అడవి కొనవోతె కొరివి.



రైతు పరిస్థితి మెరుగైతేనే జాతి, దేశం బాగుపడి నట్లని, అందరూ త్రికరణశుద్ధిగా వ్యవహరించిన్నాడే నిజమైన చైతన్యం.

కలవారి కోడలు కలికి కామాక్షి
అప్పుడే వచ్చెను ఆమె పెద్దన్న
కాళ్లకు నీళ్లిచ్చి కన్నీళ్లు నించె
ఎందుకు కన్నీళ్లు ఏమి కష్టాలు
ఎత్తుకో బిడ్డను ఎక్కు అందలము
మంచం మీద కూర్చున్న ఓ మామగారు
మా అన్నలొచ్చారు మమ్మంపుతారా!
నేనెరుగ నేనెరుగ నీయత్తనడుగు
అరటి తోటానున్న ఓ యత్తగారూ!
మా అన్నలొచ్చారు మమ్మంపుతారా!
నేనెరుగ నేనెరుగ నీ బావనడుగు
భారతము చదివేటి బావ పెదబావ!
మా అన్నలొచ్చారు మమ్మంపుతారా!
నేనెరుగ నేనెరుగ నీభర్తనడుగు
రచ్చలో కూర్చున్న రాజేంద్రభోగీ
మా యన్నలొచ్చారు మమ్మంపుతారా!
పెట్టుకో సొమ్ములు కట్టుకో చీర!
ఎత్తుకో బిడ్డను ఎక్కు అందలము...

భారతీయ జీవన విధానంలో ఉమ్మడి కుటుంబాల గౌరవం ఉమ్మడి కుటుంబాలదే. స్వార్థం పెరిగిన ఆధునిక యుగం, ఉమ్మడి కుటుంబాలలో గొడవలెక్కువ అంటున్నది. కాని అందలి హుందాతనం, పరస్పర సహకార భావం పెద్దా చిన్న తారతమ్యం తెలిసి మెలగడంలోని సంతోషం, వంగి వాలీ మసలడంలోని ఔచిత్యం, బాధ్యతలన్నీ పెద్దలు వహిస్తున్నప్పుడు చిన్నవారనుభవించే స్వేచ్ఛ ఆనందాన్ని కలిగిస్తుంది. ఇంట్లోని యువకులకు పెళ్లిళ్లుకాగానే తమ భార్యా పిల్లలతో బయటకు వచ్చేసి వేరుగా జీవించడం, ముసలి తనంలో వున్న తల్లిదండ్రులూ, తాతా నాన్నమ్మలను వారి కష్టాలకు వారిని వదిలిపెట్టడం, ఆధునికమయింది. ఈ అధునికంలో కుంటుంబ సభ్యులు సుఖాలతో పాటు దుఃఖాలను సైతం భాగించి, పంచుకోవాల్సి వస్తుంది; పై గేయం ఉమ్మడి కుటుంబ జీవనంలోని ఒక దృశ్యాన్ని మన ముందుంచుతుంది.

అత్తగారింట సకల భాగ్యమ్ములున్న మగని మీదను తనకెంత మక్కువున్నా. తన తల్లిగారింటి వారిని చూడగానే ఆడపిల్ల కన్నీటి పర్యంతమౌతుంది. అన్నను చూసిన కలికి కామాక్షికి అదే జరిగింది. అన్నకాళ్లకు నీళ్లిచ్చి కన్నీళ్లు నించింది. అతిథి కాళ్లకు నీళ్లివ్వడం ఆంధ్రుల జీవన విధానంలో భాగం. అది అతిథిని గౌరవించడంగా భావిస్తాం. 'వానింటికి ఎళితే కనీసం కాళ్లకు నీళ్లివ్వలేదు' అంటారు. కాళ్లకు నీళ్లివ్వడమంటే గౌరవించడమని భావం. గౌరవించడం అటుంచితే, కాళ్లకు దుమ్ము ధూళితో వచ్చారు, ఆ దుమ్ము బయటే కడుక్కొని రండి, మా యింట్లో చిన్న పిల్లలున్నారు, అంటువ్యాధులు ధూళికణాల ద్వారా రావడానికవకాశం వుంది, అని చేసే హెచ్చరిక కాళ్లకు నీళ్లివ్వడంలో వుంది.

చెల్లెలి కన్నీళ్లు చూసిన అన్న అందలమెక్కు, అమ్మగారింటికి వెళదామన్నాడు. కాని ఆమె ఉమ్మడి కుటుంబంలోని బాధ్యతలు, పద్ధతులు తెలిసి పెరిగింది. కాబట్టి వెంటనే బయలు దేరలేదు. అన్నకీ విషయం తెలియదని కాదు, చెల్లెలి మీద మమకారం, ఆమె కన్నీళ్లు, అతడిని ఔచిత్యం గురించి ఆలోచించనీయలేదు.

మా అన్నగారు వచ్చారు. నన్ను అమ్మగారింటికి రమ్మంటున్నారు. నన్ను పంపిస్తారా! అని మొదట మామగారి నడిగింది. అతడు ఉమ్మడి కుటుంబం పెద్ద అందుకని మొదట ఆయననడిగింది. అదీ పద్ధతి. కానీ ఆయన అందుకనుమతించలేదు. అత్తగారి నడుగ మన్నాడు. అత్తగారూ అనుమతించక బావనడుగమన్నారు. బావగారు సైతం సెలవియ్యక భర్తనడుగమన్నారు. చివరకు భర్తగారే అనుమతి చ్చారు. అమ్మగారింటికి వెళ్లడానికి

అనుమతిచ్చింది భర్తే కావచ్చు అమ్మాయి మొదట పెద్ద వారినడగడంలో ఔచిత్యం, ఆ పెద్దవారు చివరకు భర్తవైపే చూయించడం, ఔచిత్యం, భర్త అనుమతించడంలో ఔచిత్యం.

పెద్దవాళ్ల నడగాల్సిన అవసరంలేదు, భర్త చెబితే చాలు, ఇంకా కావాలంటే, భర్తనూ అడగాల్సిన అవసరం లేదు అనేది అత్యాధునిక మంటున్నారు.

ఉమ్మడి కుటుంబ సున్నిత విధానానికి ప్రతీక పై వుదాహరణ

**బుర్రుపిట్ట బుర్రుపిట్ట**
**తుర్రుమన్నది**
**పడమటింటి కాపురం**
**చేయనన్నది**
**అత్తదెచ్చిన పట్టుచీర**
**కట్టనన్నది**
**మామ దెచ్చిన మల్లెపూలు**
**ముట్టనన్నది**
**మొగుడు దెచ్చిన మోటు సీర**
**ముద్దు గన్నది,**
**బుర్రుపిట్ట .......**

పూర్వపుఉమ్మడి జీవన విధానంపై ఆధునికతా ప్రభావాన్ని చూపేదీ గేయం. చిన్న కుటుంబమే చింతలు లేని కుటుంబమనీ, ఎవరికీ వారే అనీ చేసే ఆలోచనా విధానమిది. ఆ యింటి కోడలు అందరితో కలిసి ఉమ్మడిగా పడమటింటిలో వుండనన్నది. అత్త దెచ్చిన పట్టుచీర కంటె మామ దెచ్చిన మల్లెపూల కంటె, మొగడు దెచ్చిన మోటుచీరే నచ్చిందన్నది. పూర్వపు జీవన విధానాల గురించి ఆధునికుల ఆలోచనా సరళిలో వచ్చిన మార్పులు స్పష్టమౌతాయి ఈ గేయంలో.

జీవిత యాత్రలో పెళ్లి ప్రధాన మజిలీ. తెలుగువారి వేడుకల్లో దీనికి పెద్దపీట; పూర్వం ఏడు రోజుల పెళ్లి జరిగేదట! అమ్మాయి, అబ్బాయి పక్షం వారి స్థాయిని బట్టి, ఆకాశమంత పందిరి, భూమంత పీట వేసి, పెళ్లి అంగరంగ వైభోగంగా, ఘనంగా చేసినామని చెబుతారు. ఏడు రోజుల పెళ్లి వేడుకల్లో 'అప్పగింతలు' ఒకటి.

**నేడ్దాకా మాబాల నేడు మీ బాల**
**కొట్టాకా తిట్టాకా కోపగించాకా**
**కండ్లనోట బెదిరించి కడుపుల దయలుంచి**
**కన్నా బిడ్డేలాగా కాపాడుకోండి!**

అమ్మాయి పెళ్లి, అంపకం, ఆంధ్రుల హృదయాలపై సున్నితంగా ప్రభావం చూపుతుంది. అమ్మాయిని అత్తవారింటికి పంపు తున్నపుడు చెమ్మగిల్లని తల్లిదండ్రి కళ్లుండవంటే అతిశయం కాదు. నిన్నటివరకూ అమ్మాయి యోగక్షేమాలు మేం చూసినాము, ఈ రోజు నుండి ఆ బాధ్యత మీదని అమ్మాయి అత్తామామలను వేడుకోవడం చూస్తూంటాం.

**మల్లీయా పూవోలే మేం బెంచీనాము**
**మామాగారి చేతుల్లా వెట్టే యాల్లాయే... కొట్టాకా**
**అరటియాకూ వోలే మేం బెంచినాము,**

అత్తగారి చేతుల్లా వేట్టే యాల్లాయే ...కొట్టాకా
బంతీయా పూవోలే మేం బెంచీనాము
బావాగారి చేతుల్లా వెట్టే యాల్లాయే
కొట్టాకా తిట్టాకా కొపగించాకా ....

అమ్మాయికి మల్లెపూవు మొదలైన ఉపమనాలు చెప్పడం సమంజసం. మల్లెపూవు కోమలమైంది. సున్నితంగా వాడుకుంటే జీవితాన్ని పరిమళ భరితం చేస్తుంది దురుసుగా వాడితే, కష్టపెడితే, నలిపివేస్తే, సులభంగా వాడి, నలిగి నశించి పోతుంది. అమ్మాయి కూడా అంతే అందువల్ల సుకుమారంగా, కోమలంగా ప్రేమగా వాడుకుని, జీవితాన్ని పరిమళభరితం, సుఖవంతం చేసుకోమనే సందేశం యీ గేయంలో లభిస్తుంది.

తల్లిదండ్రులు తమ తనయ గురించి చేసే ఆలోచనా విధానానికిది ప్రతీకగా నిలుస్తుంది.

ఓరోరి బండోడో ఒరిగడ్డి బండోడా!
నిలవెట్టు బండోడో బండిమీన నేనొస్తా!
నీ యెద్దు కొమ్ములూ నా పక్క పిన్నీలు
న యెద్దు పగ్గాలు నా నెత్తి సౌరాలు
నీ బండి కందేనా నా కంటి కాటూకా
నిలవెట్టు బండోడో బండిమీన నేనొస్తా!

గ్రామాల్లో యువతీ యువకుల మధ్య జరిగే చతుర సంభాషణలు ముద్దు ముద్దుగా వుంటాయి. వరిగడ్డిని బండిలో తొక్కుకుని పోతున్న యువకున్ని పిలుస్తూ యువతి, ఆతని బండినాపమనీ, తానూ దానిపైవస్తానని అడుగుతుంది. అంతేకాదు, వాని బండి యెద్దు కొమ్ములు, ఎద్దుల పగ్గాలు, ఒండి కందెన, తన అలంకరణ సామగ్రి అంటుంది. దీంతో వాడు బండినాపుతాడు ఆమెకు సహకరిస్తాడు. జానపదుల జీవన స్రవంతిలో పరిసర ప్రకృతి ప్రతిబింబాలే అన్నీ.

జానపదుల జీవితాల్లో అనవసర ఆడంబరాలుండవు. వావి వరుసలతోడి పిలుపులు ఆత్మీయతనందిస్తాయి. కులాలు, మతాలు, అంతస్తులు అడ్డురావు అందరూ అన్నా, తమ్మీ, అక్కా, బావా, అత్తామామా మొదలైన వరుసలతో చేసే పలుకరింపులు పులకరింతలు గలిగిస్తాయి.



తెలుగు జానపద జంటల్లో ఎంకన్న శెంద్రమ్మ జంట ప్రముఖమైంది. తెలుగు జానపదంలో వీరి విషాదగాథను తెలియని వారుండరు.

'శెందురమ్మంటావు
శెంపకురుకేసేను
శెందిరానీ పిలువరాదో రెంకన్న!
ఎంకన్న అంటావు
ఎన్నువలిగేసేను
ఎంకడానీ పిలువరాదో శెంద్రమ్మ!...

.............................................

శెంద్రమ్మ, ఎంకయ్య, అని గౌరవంగా పిలిస్తే మన నాయికా నాయకులకు యెబ్బెట్టుగా తోచింది. అందుకని శెందిరీ! ఎంకా! అనే పిలువమంటున్నారు ఒకరినొకరు. ఆత్మీయతల్లో నిష్కల్మషత్వం నిరాడంబరత గోచరిస్తాయి. పేర్లకు అమ్మ, అయ్య, గారు! తగిలించడం కృతకంగా కనబడుతుంది జానపదులకు

ఎంకన్న శెంద్రమ్మ
డొంకాల వుండంగా
డొంకంత మరుకాయె
సరుకారు కెరుకాయె
ఓ రెంకన్న ఒంకాజాట్టెంకన్న
పారిపోతివి ముండకొడుకో రెంకన్న...

.............................................

అంటూ సాగే కథాగేయంలో ఎంకన్న శెంద్రమ్మల పవిత్ర ప్రేమ, అది దారితీసిన విషాద ఘట్టం, సహృదయులకు యెనలేని బాధను కలిగిస్తుంది.

జానపద నాయికా నాయకుల అలుకలు అద్భుతంగా వుంటాయి. ఒకరి నొకరు చూసుకుంటూనే అన్యాపదేశంగా సంభాషిస్తుంటారు.

పట్టుచీరె దెచ్చినాను
పెట్టెలోన పెట్టినాను
కట్టమాని చెప్పవే
తడుకో తడుకా!
చీరకంచులు లేవు

**చుట్టుచెంగులు లేవు**
**వద్దని చెప్పవే**
**తడుకో తడుకా!**

ఎడముఖం, పెడముఖంగా వున్న నాయికా నాయకులకు 'తడక' ఆధారమయింది. తడకను సంబోధిస్తూ వారంటున్న మాటలు ఒకరికొకరికి వినబడుతూనే వున్నాయి. ఒకరి అభిప్రాయం మరొకరికి అర్థమవుతూనే వుంది. ఆనందం కలుగుతూనే వుంది. అభిమానం అడ్డు వస్తుంది కొంతసేపు. ఆ తర్వాత "భగ్నో మాన కలిన్సహాన రభన వ్యాసక్త కంఠగ్రహులౌతారు". జానపదంలో ఇది 'తడక రాయ బారం'గా ప్రసిద్ధి.

మనిషిని మనిషి పీక్కుతినే స్వార్థం నిండిన లోకంలో జానపదుల త్యాగగుణం, పరోపకార తత్వం, ఆశ్చర్యం కలిగిస్తాయి. ఆడంబరం అహంభావం మచ్చుకైనా వీరిలో కనబడదు. తాను కాలి కరిగిపోయినా లోకాలకు మేలు చేయాలనే వెలుగు దివ్వెతత్వం జానపదులది. స్వార్థపూరిత పట్టణ సంస్కృతి వ్యాపించి యిపుడిపుడే పల్లెలను పాడు చేస్తుంది. ఒకనాటి పల్లెటూళ్లు ఆదర్శప్రాయాలు.

**వస్తావు పోతావు నాకోసం**
**వచ్చి కూసున్నా నీకోసం**
**సగము చచ్చున్నాను నీకోసం**
**సాలీమి చస్తావు నాకోసం**

గాలానికి కుచ్చబడిన ఎఱ్ఱన్నను ప్రతీకగా చేసి యిచ్చే సందేశం యీ గేయంలో వుంది. గాలానికున్న యెఱ్ఱన్నను చూసిన చేప, నా కొరకెవరో ఆహారం వేసినారని అమాయకత్వంతో దానిని మింగబోతుంది. చేపను వారిస్తుంది ఎఱ్ఱన్న. నన్ను ఎరగా జూపి నీ ప్రాణాన్ని తీయాలనే మోసగాడు పైన కూర్చున్నాడు. నన్ను నీవు మింగితివా! నిన్ను వాడు మింగుతాడు. వాడు కూర్చున్నదందుకే. నేను గాలానికి కుచ్చబడి సగం చచ్చినాను. నేనేమైనా పరవాలేదు. నీవు మాత్రం ఈ చాయలకురాకు. వస్తే ప్రాణాపాయం కలుగుతుందనే హెచ్చరిక చేసింది ఎఱ్ఱన్న. తనకుకష్టం కలిగినా పరవాలేదు. ఇతరులకు మేలు కలగాలనే పరోపకార తత్వం ఎఱ్ఱన్నది. జానపదుడే ఆ ఎఱ్ఱన్న.

ఏరు దాటి తెప్పను తగలేసే కృతఘ్నత్వం జనపదానికి జాన పదానికి ద్రోహం తల పెట్టినా, సహజ సౌభాగ్య సజీవత్వ జానపదం కించిత్తు హానికి గురికాదు.



**పసులకు వొన్నెలున్నయిగానీ**
**పాలకు వొన్నెలున్నాయా! ....**

అని పాడుకునే జానపదుని నిష్కల్మష హృదయంలో సర్వ మానవ సౌభ్రాతృత్వ సమాన భావన, అంతర్గత ఆత్మతత్వం బోధ పడుతుంది.

**పారే వుతుకం వొకాటె గానీ**
**పరమాత్ముని కృప యెరుంగరా**
**ఇప్పకు ఈదుకు మరి గంజాయికి**
**నిసావోసి మరి నింపెనురా!**
**మామిడి కొమ్మకు మరినిమ్మకు తన**
**మమతను పోసే నింపెనురా!**

ఏరులో పారే నీరొకటేయైనా ఇప్పలో నిషాను, మామిడిలో రుచికరమైన రసాన్ని నింపింది. మంచికీ చెడుకూ అన్నింటికీ పరమాత్ముని కృపే కారణం అంటాడు జానపదుడు.

పైన వివరించిన విషయాలు జానపద జీవన గతులకు మాసరలు మాత్రమే.

కుల, మత, వర్గ ప్రాంతీయాహంభావాలతో కుమ్ములాడే వారికి జానపదుని సందేశం, ఆత్మతత్వంలో కొంతవరకు అంటినా 'సర్వేజనాస్సుఖినో భవన్తు' అనేది సుసాధ్యం.

**మూసీ**
**ప్రత్యేక సంచిక**
**డిసెంబర్ - 2000**

# కాముని పండుగ

కవికుల గురువైన కాళిదాసు తన అభిజ్ఞాన శాకుంతలంలో 'ఉత్సవ ప్రియాః నరాః' అని సాధారణీకరించాడు; నరులు ఉత్సవ ప్రియులని దాని భావం. ఉత్సవాలు స్థాయిని, సందర్భాన్ని బట్టి వుంటాయి. తమ సాధారణ స్థాయిని మించి జరుపుకొనడమే ఉత్సవం; రోజూ తినే దానికంటే స్థాయిలో, వ్యయంలో మించినదే ఉత్సవం నాడు తినాలి. రోజూ ధరించే దానికంటే మించిన దానిని ధరించాలి. రోజూ విశ్రమించిన దానికంటే మించి ఉత్సవం నాడు విశ్రాంతి తీసికోవాలి.

సమాజంలోని రకరకాల మానవులందరకూ పండగ ఒకటేకాదు; తాను మునిగిందే గంగ అన్నట్లు తాను మెచ్చిన స్థాయిలో ఉత్తమోత్తమమయిందే పండగనాడు తాననుభవించాలి.

నాగరక ఛాయలు మానవాళిపై ప్రసరించింతర్వాత, ఈ పండుగలు, ఉత్సవాలు పొడసూపినవి. అవి ఆర్థికపరమైనవి కొన్నయితే, పారమార్థికమైనవి కొన్ని. ఏడాది పొడుగునా శ్రమించి, పగలనకా రేయనకా పడిన శ్రమకు ఫలితం ధాన్య రూపంలో యింటికి వచ్చినపుడు సంతసించినరైతు, కనీసం ఆ రోజైనా విశ్రాంతిగా, తలంటుకొని, స్నానమాడి, పిల్లాపాపలతో కలిసి, ఇష్టమైన, వంటకాలు తినడం, తన వ్యవసాయానికి మూలమైన ఎద్దులను అలంకరించడం, మొదలైనవి మొదట ఉత్సవాలకు, పండగలకు ప్రారంభ ప్రేరకాలు. కాగా, నాటి సమాజంలో రైతు మూలస్తంభం కావడంవల్ల మిగతా వృత్తుల వారు సైతం రైతు ననుకరించడం సహజం. అలా ప్రారంభమైన పండగలు ధాన్యంపేరా, ధనంపేరా, గుట్టపేరా, పుట్టపేరా, చెట్టుపేరా, పుట్టినపేరా చచ్చినపేరా, వ్యాపించి, కావలసినన్ని పండగలు పుట్టుకు వచ్చినవి. మంచివాడనుకున్నవాడు పుట్టినా, చెడ్డవాడు చచ్చినా, పండగ అనుకోవడం, పరిపాటయింది. ఇట్లా నేటి ప్రపంచం, ప్రతిరోజూ, ఏదో ఒక పండగ జరుపుకుంటూనే వుంది.

భారతీయుల పురాణ సంబంధమైన పండగ లలో కాముని పున్నమ ఒకటి. దీని వికృతరూపాలు ప్రపంచంలోని చాల దేశాలలో కనబడుతున్నాయి. ఇది పాశ్చాత్య దేశాలలో ఫైర్ ఫెస్టివల్స్ కోవలోకి వస్తుంది.



శాలివాహన శక పంచాంగం ప్రకారం ఫాల్గుణ శుద్ధ పౌర్ణమినాడు కాముని పున్నమి జరుప బడుతుంది; కాముడు-మన్మథుడు, మన్మథుడు ఈ రోజు ఊరూరా కాల్చబడతాడు. శివుని మూడవ కంటి కార్చిచ్చురేగి, కాయజుడు మాడి బూడిద కట్టైయైన దినమిది. ఈ ఉత్సవానికి మూలం మన కుమార సంభవ ఇతి వృత్తమే.

భౌతికంగా బలవంతులైన రాక్షసుల దురాగతాలు మితి మీరినవి. వారి నాయకుడు తారకుడు. వానికి యెదురు లేకుండాపోయింది. శివ పార్వతుల సంతానము మాత్రమే దురాగతాలకు ఆనకట్ట వేయగలరు అనేది విధి. అలూ లేదు-చూలూలేదు. కొడుకు పేరు సోమలింగం"-అనే సామెత అపుడే పుట్టి వుంటుంది. శివుడు నిశ్చలుడాయె, పార్వతిపట్టు వదలదాయె, ఇక వారికి సంతానం కలగడమెలా? లోకం కష్టాలు గట్టెక్కడమెలా ! నిశ్చలుడిని చంచలుడిగా జేసి, పార్వతిపై పరవశతను పొందిన వానిగా జేయమని సకల లోకాలూ మన్మథుని ప్రాధేయ పడినవి. బహుజన హితాయ, బహుజన సుఖాయ, లోకకళ్యాణార్థమ్, కాముడీ పనికి పూనుకున్నాడు. కృతకృత్యుడైనాడు తర్వాత శివుని మూడవ కంటి మంటల్లో మాడి బూడిదైనాడు. (తర్వాత మళ్ళీ బతికినాడు. అది వేరే సంగతి).

కాముని ఆత్మ త్యాగదినోత్సవమే కాముని పండగ. ఈ సంఘటన సాహిత్య వైవిధ్యాలలాగానే కాముని కథా చిత్రణలో సైతం,రకరకాలుగా మలుపు తిరిగింది, కాళిదాసు కుమార సంభవంలో 'సమధత్త బాణం' (3-66) అని, బాణం యెక్కు పెట్టినాడన్నాడు. నన్నెచోడుడు తన ఆంధ్ర కుమార సంభవంలో 'కంతుడేయ దొడగె'(5-36) అని, మన్మథుడు బాణాలు తానే వేసినాడన్నాడు. ఇక జానపదుల సాహితీ సముద్రంలోనైతే మన్మథుడు ఓలలాడినాడు. తల్లి కేసి గుప్పినాడు; తండ్రికేసి గుప్పినాడు.

బసువంత దెచ్చినాడె  
ఓలీ  
శెమ్మ కేలిల ఓలీః  
నీల్లుల్ల గల్పినాడె  
ఓలీ  
శెమ్మకేలిల ఓలీ  
తల్లికేసి గుప్పినాడె  
ఓలీ-శెమ్మ కేలిల ఓలీ  
వొర్పలేదు వాయి లేదు-ఓలీ॥

తండ్రికేసి గుప్పినాడె ఒలీ
శెమ్మకేలిల ఒలీ
వొర్సలేదు వాయిలేదు ఒలీ
....... ....... ........

శివ పార్వతులు లోకాలకు తండ్రీ తల్లి; వారిపైకే మన్మధుడు తన అస్త్రాలు ప్రయోగించి నాడు. ఇక్కడ వొర్సలేదు, వాయిలేదు. (వరసా వాయి) 'తల్లికేసి గుప్పినాడు తండ్రికేసి గుప్పినాడు-అని జానపదులు కమ్మగా పాడుతూ వివరిస్తారు. 'కింశుకాది కుసుమరాగాంభసా' హోళీని గడుపుకున్నారని కామశాస్త్రంలో వివరించారు, అ కింశుకమే ఇక్కడ 'బసు వంత' అయింది.

తారకుడు బలవంతుడు. వాని దురాగతాల వల్ల సామాన్య జీవితానికి భంగం కలుగుతున్నది కూడూ గుడ్డా దొరకడం లేదు. ఈ దుర్మార్గుడు నశిస్తేనే తాము మళ్లా సాధాణమైన బతుకు గడప గలుగుతారు. అందుకు జానపదులు తమ కాముని, అదే మన్మధుని ప్రార్థిస్తున్నారు. ప్రాధేయ పడుతున్నారు పరిస్థితులను యేకరువు పెడుతున్నారు వచ్చి చక్కదిద్దమంటున్నారు

జొన్నా గింజా బంగారమాయె
జోగుల్ జొంపుల్ జొటాకులాయే
ముర్సుకుంట రావోయి కామన్నా
నాముత్యాల పందిరి కిందికి॥

ప్రజల ప్రార్థన విన్న కాముడు వస్తాడాః
వస్తే ఎట్లా వస్తాడు ఒక్కడేనాః!

గూడు గూడే గున్నసింతా
దీగినాడే దొమ్మరోడూ-
దొమ్మరింటి దొడ్డ బిడ్డా
మాయింటీ ఆడ బిడ్డా-
శిక్కు దీసీ కొప్పు వెట్టీ
సీరి గందం బొట్టు వెట్టీ
యేడి కోతవ్ కామన్నా
మంచి నీల్లా బాయి కాడ్కీ
మల్లెలమ్మ తోట కాడ్కీ ...

లోకం కొరకు కాముడు కదలినాడు, శివుని ప్రేరేపించాలి. ఆనాటి దొమ్మరోడిలా అలంకరించుకున్నాడు. తోడుగా దొమ్మరింటి దొడ్డ బిడ్డ- రతి, ఇద్దరే వచ్చారా; శుకపికాదులు, సమీర వసంతాదుల గూడెంగూడెమే, మంచి నీళ్లబాయి; మల్లెలమ్మ తోట; అదే పార్వతి తపమొనరిస్తున్న తోట!

కాముడు శివపార్వతులపై పూల బాణాలు వేసినాడు. అదే వసంతాలాడినాడు. నిశ్చలుడైన శివుడు చంచలుడైనాడు. ఈ పరిణామాన్ని మనోనేత్రంతో గమనించాడు శివుడు ఉగ్రుడైనాడు. మూడవ కన్నుతెరిచాడు; ఫలితం;!

జోజెర జోజెర గాజుల పాపా
గాజుల్ గీజుల్ సవ్వాయి సాపా
సాప సాపకే సందే దీపం
దీపందీసుక పల్లెకె పోతే
పల్లె కుక్కాలన్ని బంవ్వు మానే
అప్పుడే నాపై జల్లు మానే
జల్లు మన్నాతాన మల్లెలు రాలే
మల్లెల మాసయ తోట వెట్టే
తోట్ల వున్నాది గుబ్బాల బొడుసూ
గుబ్బాల బొడుసూకు గుత్తాపురైకే,
రైకే గాదూరో రావేణ దండూ
దండు గాదూరో దామేర మొగ్గా
మొగ్గ గాదూరో మోదూగునీడా
నీడ గాదురో నిమ్మల బాయీ
బాయి గాదూరో బచ్చాలి కూరా
కూరా గాదూరో కుమ్మారి మేనూ
మేను గాదురో మేదారిల్లూ ఇల్లూగాదురో ఈగేలె తెట్టే
తెట్టె గాదూరో ముసలోని......

విచలితుడైన శివుడు ఆత్మ పరిశీలన చేసికొన్నాడు. యుగ యుగాలుగా లేని మానసిక వికారం, యిపుడెందుకు కలిగిందని, విచికిత్స చేసి తెలిసికొన్నాడు. ఆగ్రహించి మన్మధుని దహించినాడు. అపుడే మన్మధుని పై(శరీరం) జల్లుమన్నది.

జల్లుమంటే అన్నది, మల్లెలు రాలనైతే రాలినవి. మల్లెలు రాలడం శివుని మనసులో పార్వతి యెడల రాగోదయానికి ప్రతీక. గుబ్బలబడుసు-గుబ్బల పడచు శివునికి పార్వతి గుబ్బలవడుచుగా కనబడడమే లోక కళ్యాణానికి నాంది.

ఆనాటి సామాజిక స్థితిగతులను వివరించే గేయాలు, ఈ పండగ సందర్భాల్లో వినబడతాయి.

**జోజెరడుగాబోతె జొనగింజ దొరికే**
**జొనగింజ పేరేం; మెంటే పి రాజు**
**మెంటేపిరా జూను దింటీమిరన్నా**
**ఆప్పరెడ్డిపల్లె కొతీమిరన్నా**
**అయినయి నెడ్లాన్ దెస్తీమిరన్నా**
**ఆర్సికోడ్తే ఆర వైపుట్లా**
**ఈర్సికొడ్తే ఇరవై పుట్లా**
**అన్నిగూడ వోస్కునె గుగ్గిల్ల శెన్నయ్య**
**గాసమియ్యామంటె మీసాల్దువుతడు,**
**మూలవాసం దీస్క ముడ్డిర్గగొడ్తే**
**ముడ్డీకి వట్టిం దడ్డెడు నూనే**
**ఆడ్డేడునూనెకు పైకం లేదు.**
**పైకంలేకుంటె పయ్యేదాన్నమ్ము,**
**పయ్యేదాన్నమ్మితె బండీకి లేదు**
**బండీకిలేకుంటె మొండిదాన్నమ్ము**
**మొండిదాన్నమ్మితే మోటకులేదు.**
**మోటకు లేకుంటె హాల్నమ్ము**
**హాల్నమ్మితె అర్కకు లేదు**
**అర్కకులేకుంటె కోడ్నమ్ము**
**కోడ్నమ్ముతె గుడ్డుకు లేదు, గుడ్డుకులేకుంటె**
**గుద్దుక సావు ....**

.... ....

దేశంలోని కరువూ; షావుకార్ల దురాగతాలు, పరిణామాలు వివరంగా పైగేయంలో తెలుపబడినాయి.



కాముని పున్నమ సందర్భంగా పాడే చాలా పాటల్లో 'శెమ్మకేలిల ఓలీ'-అనే వూతపదం వుంటుంది. 'శ్యాం ఖే హోళీ'- అనే హిందీ వాక్యానికి యిది వికృతరూపం కావచ్చునని విమర్శకులంటున్నారు.

కాముని వున్నమకు సుమారు వారం రోజుల ముందు రాత్రుల్లో అమ్మాయిలూ, అబ్బాయిలూ వేరువేరుగా గుంపులుగుంపులుగా తయారై ఇల్లిల్లూ తిరిగి జోజెర అడుగుతారు.

మగపిల్లలు ఒకపిల్లవానికి ఎలుగుబంటి వేషం వేస్తారు. శరీరానికంతటికీ నల్లని గోనె బొంతలు చుడతారు పాతచేటను వంచి వాని తలకు కట్టి పొడుగ్గా, ఎలుగుబంటి మూతిలాగా వచ్చేట్లు చూస్తారు, ఎలుగుబంటి వేషం మెడకు తాడు, లేక పగ్గం బిగించి, ఆ గుంపులో బలంగా వున్నవాడు తాడు చేతిలో పట్టుకుని కనబడతాడు. ఎలుగుబంటి అక్కడి వారిని కరువబోయినట్లు పిల్లవాడు దానిని అదుపు జేసినట్లు నటిస్తారు. అందరి చేతుల్లో నిలువెత్తు కర్రలుంటాయి. వానిని నేలకు లయగా పొడుస్తూ పాడుతూ వుంటారు.

**జోజెర జోజెర గాజుల పాపా**
**గాజూల్ గీజూల్ సన్నాయి సాపా .....**

.......

మొదలైన గేయాల్ని -ఆ గుంపు నాయకుడు చెబుతూ వుంటే, మిగతా వారంతా పాడుతూ వుంటారు. ఎలుగుబంటి అడ్డంగా వూగుతూ పాట కనుగుణంగా అడుతూ వుంటుంది.

ఎలుగుబంటిని వారు పట్టి ఆడించడం ఆనాటి పరిస్థితులను వా రధిగమించినార నడానికి ప్రతీక కావచ్చు.

ఆడ పిల్లల గుంపు వేరుగా వస్తుంది. ఓ చిన్న పటువ (కుండ)కు చుట్టూ సన్నని రంధ్రాలు చేసి, దాంట్లో ఓ దీపం వెలిగించి మీద మూత వుంచి, ఓ అమ్మాయి తలమీద చుట్ట బట్ట పెట్టి ఈ కుండను ఆమె తలకెత్తుతారు. కారుచీకట్ల నడుమ పటువ సన్నని రంధ్రాల నుంచి బయటకు ప్రసరించే దీపపు కాంతులు-అకాశమూ చుక్కల్లాగా కనబడుతుంది.

అమ్మాయిలు-

**నున్నాటి బండమీన-కామక్కామయ్యలో**
**నూగులెండబోసి-**
**ఎన్నెన్ని నూగులన్ని -గంపలకెత్తీ**
**గంపలనూగులన్ని -గాన్గలవోసీ**

**ఎక్కెక్కితొక్కంగ -ఎల్లెనమ్మనూనే**
**నూనెమ్మనూనే-నున్నువడనూనే-**
**నూనెట్ల వాకో -నెత్తిబిల్లదొరికే-**
**నెత్తి బిల్లవెట్టుక నెల్లూరి కోతీ**
**నెల్లూరి లమిడి కొడకు శెల్లకొంగు వట్టే**
**పట్టకులమిడికొడుక భావ్యం కాదూ**
**ముట్టాకు లమిడి కొడుక మిరిపెంకొదు .....**

అని పాడుతూ ఇల్లిల్లూతిరుగుతూ జోజెర ఆడుగుతారు.

కామదహనం నాటి సాయంకాలం జనం ఇంటింటికీ తిరిగి, కట్టెలూ నుగ్గులూ పోగుచేస్తారు. అట్లా పోగయిన వానినన్నిటినీ గ్రామంలోని నాలుగు తోవల కూడలిలోనో, దేవాలయం దగ్గరో చావడి సమీపంలోనో పేర్చి, గ్రామ పెద్దలందరినీ సమావేశపరచి, వారి సమక్షంలో కట్టెల పోగుకు, అంటే అదే కాముని చితికి నిప్పంటిస్తారు. గ్రామంలోని వారందరూ ఆ చితిలో తమ యింటినుండి విధిగా కనీసం ఒక కట్టెనో ఒక పిడకనో తెచ్చి వేయడానికి యత్నిస్తారు. అలా చేయడంవల్ల సంవత్సరమంతా వారికి శుభాలు కలుగుతాయని విశ్వాసం.

ఈ కామ దహనానికి యవకులు కొంతమంది వేరే వారి దొడ్లనుండి, ఇండ్లనుండి కట్టెలు, నుగ్గులు దొంగతనంగా తెచ్చి మంటలో వేస్తారు. అరోజు ఆట్లాంటి నేరాలన్నీ మాఫ్. అంతగా పట్టించుకోరు. నవ్వుకుంటారు. తమకే మేలు కలుగుతుందనుకుంటారు.

కాముని చితి కాలింతర్వాత, మరుసటిరోజు ఉదయాన్నే, గ్రామ పెద్దలందరూ వచ్చి ఆ బూడిదను గ్రామంలోని ఇంట్వంటికీ పంచుతారు. ఇండ్లలోని పెద్ద మనుషులు, ముఖ్యంగా నానమ్మ అమ్మమ్మలు ఆ బూడిదను భద్రపరిచి, ఇంట్లోని వారి కెవరికైనా యెపుడైనా 'గాద' (చర్మ వ్యాధి, స్కిన్ ఎలర్జీ) వస్తే, ఈ బూడిదను ఔషధంగా పూస్తారు. నీళ్లలో కలిపి తాపుతారు. పైత్య ప్రకోపం వల్ల కలిగే యీ 'గాద' కాముని చితి భస్మాన్ని వాడడం వల్ల తగ్గుతుందని విశ్వాసం.

ఈ సందర్భంగా యవతీ యవకులు ఒకరిపై మరొకరు రంగులు చిమ్ముకోవడం, బురద పూసుకోవడమూ జరుగుతుంది. ఈ పండగ రోజుల్లో ఇటువంటి రంగులూ, బురదల వల్ల అనవగాహనలూ, దురవగాహనలూ కలుగవు. అంతా పండగ సందర్భంలో సంతోష క్రియగానే స్వీకరిస్తారు.

కాముని పండగ సందర్భాల్లో బురుద చల్లుకోవడం ఒకరకంగా 'కర్దమ ప్రసాదన క్రియ' యని కొందరి అభిప్రాయం, ప్రకృతి చికిత్సా విధానంలో మృత్తికా విధానం ఒక



ప్రక్రియగా చెప్పబడింది. మెత్తని ఒండు మట్టిని శరీరానికి పట్టించి కొంతసేపు సూర్యరశ్మిలో ఆరనిచ్చి, తర్వాత శరీర మర్దనం కావించుకొని స్నానంచేస్తే, చర్మవ్యాధులు రాకపోవడమే కాదు, మానసిక తాపాలూ దూరమౌతాయని విశ్వాసం.

నేటి కాముని పండగ బురద చల్లుకోవడాలు పేడ, తారు, సునేరు, మరెన్నో మురికి పదార్థాలు పూసుకునే వరకు దిగజారింది, కాళ్ళు చేతులు బిగించి మురుగు కాలువల్లో ముంచేవరకు మనం చూస్తూనే వున్నాం, ఇది కాలవైపరీత్యం,

ఉత్తర భారతదేశలోని కొన్ని ప్రాంతాల్లో కాముని పండగను హోళికోత్సవంగా జరుపుకుంటారు. శిశువులను చంపి తినే ఒక రాక్షసిపేరు హోళికా. దానిని ఫాల్గుణ పూర్ణిమ నాడు చంపి తమ శిశువులకు ఆపదరాకుండా చూసుకుంటారు. అందువల్ల అది హోళికోత్సవ మయిందని ఉత్తర భారతంలో ఒక ఐతిహ్యం.

ప్రతి వర్ష కుతుకాగతులై వసంతోత్సవాలు జరుపుకొనే వారిని వర్ణించిన ప్రబంధ సాహిత్యాలూ మనకున్నాయి.

ఏది ఏమైనా కాముని పున్నమ ఆంధ్ర దేశంలో, ఒక జానపదుల పండగ. చిన్నా, పెద్దా, బీద, ధనిక, భేదాలు లేకుండా అందరూ పాల్గొని జరుపుకొనే పండగ. ప్రకృతితో, పురాణ సంబంధి సంఘటనలతో సంబంధమున్న పండగ. అధిక జనాదరణ పొందిన జానపదుల పండగ.

**తెలుగు విశ్వవిద్యాలయం**
**జాతీయ సెమినార్**
**డిసెంబర్ 1999**

# చైతన్య సందేశం-మేఘదూత కావ్యం

సరస్వతీపుత్ర సార్థక బిరుదాంచితులు పుట్టపర్తి నారాయణాచార్యులు. వారిది బహుముఖమైన పాండిత్యము; రచనావైవిధ్యం వారి సొత్తు. పద్యం గేయం వచనం యేది వ్రాసినా వారిది ప్రత్యేక ఒరవడి. దానికదే సాటియైన శైలి. ప్రతిభా వ్యుత్పత్తి అభ్యాసమూ, ముప్పేటలుగా ఆయన నల్లుకున్నవి. సంస్కృతం, ఆంధ్రం, కన్నడం, హిందీ, ప్రాకృతం, తమిళం, మళయాళం, ఆంగ్లం మొదలైన భాషల్లో కవిత్వం చెప్పగల దిట్ట నారాయణాచార్యులు.

పుట్టపర్తి వారు ఆడెనమ్మా! శివుడు పాడెనమ్మా! అంటూ తమ శివతాండవాన్ని సాభినయంగా గానం చేస్తుంటే సంగీత సాహిత్య నాట్యశాస్త్రాలకు భాష్యం చెప్పినట్లుండేది. నిజంగా శివమూర్తి తమ కళ్లముందు తాండవమాడుతున్న స్ఫూర్తి శ్రోతలకు కలిగేది; ఆయన మహాభారత విమర్శనము సముద్రమును మథించి సుధను సాధించినట్టిది. ఆచార్యుల పెనుగొండ లక్ష్మికి ఒక ప్రత్యేకత వుంది. పన్నెండు సంవత్సరాలైనా దాటని వయస్సు, ఛందస్సులగువు బిగువులు పూర్తిగా తెలియని దశలో వ్రాయబడిందీ కావ్యం. సంస్కృత విద్యాన్ పరీక్ష వ్రాస్తున్నపుడు ఆయనకే అది పాఠ్యగ్రంథంగావడం అయన సహజ పాండిత్యానికి, ప్రతిభకూ ఉదాహరణ. అచార్యుల వారు స్వయంగా పలుమార్లు ఈ విషయాన్ని మధురానుభూతిగా అభివర్ణించే వారు. ప్రపంచంలోని మరే ఇతర సాహిత్యంలో ఏ వ్యక్తికి ఈ అనుభూతి కలుగకుండవచ్చు.

సుప్రసిద్ధమైన ఎన్నో గ్రంథాలు పుట్టపర్తివారు వ్రాసినా మేఘదూత వారి కీర్తి కిరీటంలో కలికితురాయి, అంటారు ఆధునిక సాహిత్య విమర్శకులు. కాలంతోపాటు మారుతున్న విలువలను ఆనాడే పసిగట్టి రానున్నతరాల అవసరాలకు వ్రాసిన కావ్యమా! అనిపించేది మేఘధూత. ఆయన క్రాంతిదర్శి, దూరదర్శి అనడానికి ఆస్కారం కలిగించినది మేఘదూత. ఇది సందేశ కావ్య పరంపరలోనికే చేరినా విలక్షణమైనది; కాళిదాసు మేఘసందేశం శృంగార, ప్రకృతి వర్ణనలకు పరిమితమైతే, జాషువా గబ్బిలం అస్పృశ్యతా వర్ణనలకు సీమితమయింది. మేఘదూత ఆంధ్రజన జీవనానికి వారి కష్టాలకూ, కలవారి స్వార్థాలకూ బలౌతున్న బక్కచిక్కిన వారి కడగండ్లకూ అద్దం వడుతుంది.

నారాయణాచార్యులు మానవతావాది. అభ్యుదయ కవి అణచబడిన సమాజ పునురుద్ధరణకు కవిగా తన వంతు కృషి సల్పినవాడు. తాడిత పీడిత ప్రజానీకం పట్ల కర్షక కార్మిక వర్గాల పట్ల వారి సమస్యాపరిష్కారం పట్ల ఎంతో సానుభూతి కలవాడుగా మేఘధూత రచనలో కనబడతాడు.



**తనవంటి మానవుల దైన్యమే సుఖశయ్య**
**గా-వారి నిట్టూర్పుగాడుపులె చామరలు**
**గా-వారి కన్నీట గరగు దినముల పైని**
**నిలచి మేమూ మానవుల మంచు గొంతెత్తి**
**ఆర్పు ధనికుల జూచి అసురులని ......**

అన్నందుకే మేఘధూతలోని కథా నాయకుడు కారాగారంలో పడినాడు; అన్యాయాన్ని అన్యాయ మనడమే వాడు చేసిన నేరం. ఆ నేరానికి బళ్ళారిలోని జైలులో గడుపుతూ శ్రీకాకుళంలోని ఒక మారు మూల పల్లెలోని తన ప్రియురాలికి మేఘం ద్వారా సందేశాన్ని పంపాలనుకున్నాడు. ఆకాశంలో మేఘం కనబడగానే.

**మనుజులను నే గోరలేనూ-శిలలైన**
**మనసులకు నే పాడలేనూ**
**ఈ సెరుగనట్టి జీసెస్సు రక్తము**
**పాశవమ్ముగమార్చె భూమినే ఈ జాతి**
**నా సఖుడ! విన్నావొ కావో! ఆ సోక్ర**
**టీసు జంపిన గాథలేవో**
**నశ్వరముగానట్టి విశ్వమానవమైత్రి**
**బోధ జేసిన యట్టి బుద్ధుడేమయ్యేనో!**

అంటూ మొర పెట్టుకున్నాడు మేఘంతో; ఈ ప్రపంచంలోని మనుషుల మనసులు శిలలైనాయి.

కరుణాజాలి మానవత్వం ఏ కోశానాలేవు. నిర్దాక్షిణ్యం గా తమ సోదరులనే చంపుతున్నారు. అని నేటి విశ్వమానవుల స్థితిగతులను ఏకరువు పెడుతూ నాకష్టాలకు మానవులైతే కరుగరు. కనీసం నీవైనా నావార్తలు నా ప్రియురాలికి చెప్పమన్నాడు.

గతి తార్కిక భౌతిక వాదాన్ని అధ్యయనం చేసి, అవగాహన చేసికొన్న వాడు కాబట్టే నారాణయణాచార్యులు కష్టపడేవారికి తగిన ప్రతిఫలం లభించడంలేదనీ, చాకిరొకరిదిగా సౌఖ్యమొకరిదిగా సాగుతున్నదనీ, అలా జరగకూడదనీ అవేదన వ్యక్తపరిచినాడు.

ఈ కావ్యంలో గ్రామజీవనం విపులంగా చిత్రించబడింది. గ్రామాల్లోని హరిజనులు, మాలెతలు, కమ్మరి, చాకలి, రైతులు, లంబాడీలు, కోయలు, కంకర గొట్టే కార్మికులు మొదలైనవారి కష్టనిష్ఠురాలు కళ్లకు కట్టినట్లుగా వర్ణింపబడినవి.

మేఘానికి మార్గనిర్దేశం చేస్తూ -

అటుచూడుమోయి! అక్కటిక మూనగదోయి
**కంకరను కొట్టుచున్నాడూ -కడుపులో**
**డొక్కలేర్పడు పిల్లవాడూ**
**వాని కనుగ్రుడ్లలో కన్నీరు కొంచెముగదిగజారి**
**కాయగాచినవాని కరమునే గాల్చేను**

అంటాడు.

ఇంకా పక్క టెముకలే యేర్పడని పాలబుగ్గల పసివాడే కంకరకొడుతూంటే, చేతులు బొగ్గలెత్తి కాయలు కాస్తున్నవి. అ కాయలపై వాని కన్నీళ్ళే కారుతున్నాయి, చూడమన్నాడు. బాలకార్మికుల బాధలను చిత్రంచడమే యిది.

**పాలకై యేడ్చుచున్నాడూ-బుడతండు**
**పట్టుదల కెత్తుకొన్నాడూ -ఆతల్లి**
**చనుబాలనిచ్చునో తన యురము జీల్చి ర**
**రక్తంబులే దాపునో ధనికులేమెరుగుదురు!!**

అంటాడు.

సమ్మెటను వేసీ వేసీ శరీరంలోని రక్తమూ మాంసమూ కరిగి చేమటై జారిపోయింది. చంటి వాడికి తాపుదామంటే ఒక్క పాలచుక్కా లేదు. ఎదను చీల్చితే రక్తమూ రాదు. కమ్మరివాని భార్య దైన్యాన్ని చిత్రిస్తూ దీనికి కారణం కలవారికి తెలుసునా! అంటాడు కవి.

**తిండి కలిగితె కండకలదోయ్**
**కండకలవాడేను మనిషోయ్- అని కదా**

మన పెద్దలన్నారు. మరి నేడు మనదేశంలో ఎంత మంది సంపూర్ణంగా ఈ అవకాశాలను కలిగి ఆరోగ్యంగా బలంగా ఉన్నారు, అని ప్రశ్నిస్తూ-

**కట్టబట్టయు తిండి గతిలేనిదేశాన**
**పుట్టగొడుగులుగాక పురుషులెవరున్నారు-**

అంటూ అక్షేపిస్తాడు? బలమే జీవనం బలహీనతే మరణం. ఆ బలం తిండివల్లే వస్తుంది. అ తిండిలేనివాడు పురుషుడు అంటే మానవుడే కాడని కవి తర్కం, వాస్తవం!

**నిండుటాకలి దూయ**
**మండు టెండలు కాయ**
**నడపీనుగుల వోలె నిలచీ శిరసుపై**
**కడు ధూళియును దుమ్ము బెరసీ, కనపడెడు**



**హరిజనులపై సుంత యాదరము నీవైన**
**పరపరా ! వారి నోదార్చు వారే లేరు-**

అంటాడు.

దేశంలో కష్టజీవుల స్థితిగతులు కడుదైన్యంగా వున్నాయి. వారు నడ పీనుగుల్లా వున్నారు. మానవులైతే ాగూ తోటివారిని పట్టించుకోరు సాయం చేయరు, సానుభూతి చూపరు. కనీసం నీవైనా కనికరించి, కరిగి నాలుగు చల్లని చినుకులు వారిపై కురిసి ఓదార్చమంటున్నాడు కవి. సాటి మానవులను మానవులుగా జూడలేని వారిని తిరస్కారంతో జూస్తున్నాడు.

సంపదలను సృష్టించేవారికి, వాని ననుభవించే అవకాశం లేకపోవడమే అన్యాయమంటాడు. పంటలు పండించేవారు వానిని తినలేని విచిత్రమైన స్థితి మనకుందంటాడు.

**అదిగదిగొ చాకితను చూడు తెలినీటి**
**యొఘుళము చూపులకు సూడూ యంతైన**
**గట్టుకొనగా చెన్నుగల బట్టయే లేదు-**
**కడుపు బిగువే లేదు కటిని బిగువే గాని-**

అంటాడు చాకితను గూర్చి. మురికి బట్టలు. ఉతికి, కట్టుకోవడానికి అందరికి వస్త్రాలిస్తుందేగాని, ఆమెకే ఒంటినిండా బట్టలులేవు. నడుం బిగించి కట్టి బట్ట లుతుకుతుందేగాని, కడుపులో 'ఆసరే' లేదని జాలిపడతాడు కవి.

వేశ్యల స్థితిగతుల గురించి జాలిపడుతూ కడుపునిండా తిండి వుండే, వారూ పాతివ్రత్యాన్ని గూర్చి ఉపన్యసిస్తారంటాడు.

మేఘదూతలో సందర్భానుసారంగా అక్కడక్కడా శృంగార వర్ణనలూ లేకపోలేదు. కావ్య మైనప్పుడు అన్ని రసాలనూ కలిగి వుంటే బాగుంటుందనేనేమో శృంగారానికీ చోటు కల్పించారు

**మత్తగజ గమనంబు నొరసీ మదిరాక్షి**
**మృదుగమనముల శిక్ష బెరసీ**
**అలతచన్నుల పైని తులకించు జవరాలి**
**కలతనిద్దుర తేనే కలవోలె చిత్రముగ**
**తలయెత్తి చూచె నవ్వాడూ ప్రియురాలి**
**తలపోసి యేడ్చికొన్నాడు-**

అంటాడు.

మేఘదూత పూర్తిగా గేయకావ్యం. త్రిశ్రచతురశ్ర మిశ్రగతులు సందర్భానుసారంగా సాగుతాయి. నారాయణాచార్యులు శ్రావ్యంగా గానం చేస్తుంటే విన్న వారి అనుభూతులకు అవధులుండవు.

కవి క్రాంతిదర్శి. భవిష్యత్తును సూచిస్తాడు

**ధనిక వాదము గాదటనగా చీకటుల**
**దన్ని త్రోసిరి బ్రతుకుచనగా**
**కడుపుగాలిన బీద కన్నీటితో నేడు**
**జలధులే పొంగెత్తి జగతులింకకపోవు**

అంటాడు.

దేశంలో ప్రకృతి సంపద పుష్కలంగావున్నా అది ప్రజలందరికీ అందుబాటులో లేదు. శ్రమ శక్తి ద్వారా దాన్ని అందుకోవాలని ప్రయత్నించినా ప్రజలకది అందడంలేదు. నైసర్గిక సంపద అందరికీ అందుబాటులో వున్ననాడే సామ్యవాదం సార్థక్యం చెందుతుంది. అందరి శ్రమను కొందరే అనుభవించినప్పుడు వారిమధ్య అగాధం యేర్పడుతుంది. ఎడం ఏర్పడుతుంది; అది సహజీవనానికి భంగం కలిగిస్తుంది. ఆగ్రహాలకూ, అవేశాలకూ, హింసకూ అలవాలమై జనజీవనం అల్లకల్లోల మౌతుంది అట్లా కాకూడదనేది పుట్టపర్తివారి విశ్వాసం.

కావ్యం పాండిత్యమూ, వర్ణనలే కాదు, సామాజిక స్పృహ నేటి ప్రధాన అవసరం, అటువంటి సామాజిక చైతన్యదాయకమైన మేఘదూత వ్రాసిన పుట్టపర్తి నారాయణాచార్యులు, ధన్యులు.

కవిని గన్న తల్లి గర్భంబు ధన్యంబు

✦ **స్రవంతి**
**మే -1994.**

✦ **ఆలిండియా రేడియో**
**ప్రసారం.**



# ఉగాది

**"అంత కడివెడు పాలపై**
**ఒక్కంత మీగడ పేరినట్లుగ,**
**మనకు మిగులను గతములో పలి**
**మంచి, అదియే సంప్రదాయము".**

తరతరాలుగా నేలపై మానవ కోటి ఉనికివుంది. వారికి చరిత్రవుంది. వారి జీవన విధానం వుంది అందలి మంచి చెడ్డలూ వున్నాయి. తర్వాతి తరాలవారు తమ పూర్వీకుల మంచిని మాత్రమే గ్రహించి, అనుకరించి, వారిని ఆదర్శంగా స్వీకరిస్తున్నారు. అపుడే వారు ఆదర్శప్రాయులౌతున్నారు. వారి జీవన విధానంలోని మంచి సంప్రదాయమౌతుంది. సంప్రదాయానికి మరోపేరు సంస్కృతి.

ఆదిమానవునికి పండగ లేకపోవచ్చు. వాని జీవన విధానం సంస్కరింప బడుతున్న కొద్దీ, ఆయా విశేషాలు చోటు చేసుకొని వుండవచ్చు. అట్లా వచ్చినవే, పండగలు.

పండగలు కొన్ని వ్యవసాయ ప్రధానమైనవైతే, మరికొన్ని ఘటనా ప్రధానమైనవి. కొన్ని ప్రకృతి ఆరాధనా ప్రధానమైనవైతే మరికొన్ని వ్యక్తి ప్రధానమైనవి. ఇట్లా పండగలు పెరుగుతూ పోయినవి.

తెలుగువారికి అతి ప్రధానమైన పండగ ఉగాది. శాలివాహన శక పంచాంగాన్ని పాటించే వారందరూ ఉగాదిని జరుపుకుంటారు. ఆంధ్ర, కర్ణాటక రాష్ట్రాల ప్రజలు వేడుకగా ఈ పండగను జరుపుతారు. ఉత్తర భారత దేశంలో, ఈ ఉగాదిని జరిపే పద్ధతిలో కొంత తేడా వుంటుంది.

"ఉగస్య ఆది ఉగాదిః" అని వ్యుత్పత్తి; నక్షత్రపు నడక ఆది అని అర్థం. నక్షత్రాలు నడక ప్రారంభించిన రోజు అని భావం. సృష్టి ఆరంభమైన మొదటిరోజది. దానికి సంకేతంగా పండగ జరుగుతుంది.

సృష్టికర్త బ్రహ్మ చైత్రశుద్ధ పాడ్యమి నాటి అరుణోదయపు వేళ వరకు, తన విశ్వసృష్టిని సమగ్రంగా పూర్తి చేయగాలిగినాడనీ, దానికి సంకేతంగా, ప్రతి చైత్రశుద్ధ పాడ్యమినే 'ఉగాది' గా భావించడం జరుగుతున్నది.

ఉగాది పుట్టు పూర్వోత్తరాలకు సంబంధించి అనేక పురాణగాథలు, చారిత్రక కథలు ప్రచారంలో ఉన్నాయి. శ్రీ మహావిష్ణువు చైత్రశుద్ధ పాడ్యమినాడే మత్స్యావతారం దాల్చి, సోమకుని సంహరించి, వేదాలనుద్ధరించి బ్రహ్మకీయడం జరిగిందనీ, అందుకే ఆరోజు ఉగాది అయిందనీ అంటారు.

జగద్విఖ్యాతిగాంచిన విక్రమార్క చక్రవర్తి చైత్రశుద్ధ పాడ్యమినాడే పట్టాభి షిక్తుడైనాడనీ, ఆ వీర పురుషుని సంస్మరణ కొరకు, తర్వాతి తరాల వారికి స్ఫూర్తికొరకు ఈ రోజు ఉత్సవాలు జరపడం ఆచారమయిందనీ, చారిత్రకాధారాలు చెబుతున్నాయి.

**"యుగా దయశ్చ కథ్యంతే**
**తథైతాః సర్వ సూరిభిః"- అని**

భవిష్యత్ పురాణ ఉత్తరభాగంలో చెప్పబడింది 'యుగాది', అనే పండగను జరుపుతుండే వారిని తెలుస్తున్నది. 'యుగ+ఆది' అని సైతం పదాలను విరిచి, యుగం ప్రారంభ సూచకంగా జరిపే పండగని చెప్పవచ్చు.

**"అత్ర శుక్ల ప్రతి పదాది రమాంత ఏవమాసః**
**ప్రాయేణ దాక్షిణాత్యే రాద్రియతే".**

అని, ఈ పండగ సంవత్సరారంభ సూచకమనీ-ధర్మ సింధుకారుడన్నాడు.

**"చైత్ర శుక్ల ప్రతిపన్మత్స్య జయంతీత్యేకే.."**

అని కొందరి ప్రకారం చైత్ర శుక్ల పాడ్యమి మత్స్య జయంతి, అంటే, మత్స్యావతారజయంతి, అనీ వాదనలున్నాయి.

చైత్ర శుద్ధ పాడ్యమే సంవత్సరాది ఎందుకు అనే విచికిత్స కలుగుతుంది. జనవరితోనే నూతన సంవత్సరారంభం యెందుకు అని రోమన్ కవి ఓవిడ్ జ్యోతిర్వేత్తయిన జానున్‌ను ప్రశ్నించాడట! సూర్యుడు జనవరి నాటికి మకర రాశిలో ప్రవేశించడంతో ప్రకృతి మంచు ముసుగు తొలగించుకొని అతనిని చూస్తుంది. దానితో రాగోదయం ఏర్పడుతుంది. నూతన జీవితం ప్రారంభమౌతుంది. కనుక నూతన సంవత్సరారంభమూ దానితోనే"- అని జానుస్ సమాధానమిచ్చాడట! అట్లే మన పూర్వులుసైతం చైత్రశుద్ధ పాడ్యమే సంవత్సరాది, లేక ఉగాది, అనడానికి ఉపపత్తి చెప్పారు. వానిలో-

బ్రహ్మ చైత్రశుద్ధ పాడ్యమినాడే సృష్టి ప్రారంభించాడన్న దానికంటే, వసంత ఋతువును దృష్టిలో ఉంచుకొని ఈ నిర్ణయం చేశారనడం సమంజసంగా వుండవచ్చు.

చెట్లు పాత ఆకులను రాల్చి, కొత్త చిగుళ్లు తొడగడం, పూతలు పూయడం, కాతలు కాయడం, సృష్టి ఫలవంతం కావడానికి ప్రారంభమన్నమాట. అందువల్ల ఋతువు నాధారంగా చేసికొనే ఈ రకమైన నియమం చేశారని చెప్పవచ్చు.



అనాది నుండీ సంవత్సరాది నిర్ణయంలో ఎన్నోమార్పులు జరుగుతూ వచ్చాయి. వేదాంగ జ్యోతిషకాలంలో ధనిష్ఠాకార్తెతో సంవత్సరం ఆరంభమయ్యేది. అంటే శిశిర ఋతువుతో రామాయణ కాలంలో వైశాఖ మాసంతో సంవత్సరారంభం. హేమంతంతో వత్సరారంభమని కాత్యునిమతం. అమర సింహుడు తన అమరకోశంలోని కలవర్గంలో మార్గశిర హేమంతాలను వత్సరాదిగా పేర్కొన్నాడు. విషువత్కాలాన్నిబట్టి సైతం వత్సరారంభం లెక్కకట్టేవారు.

మేష విషువత్తు - అనగా ఉత్తరాయణం నుండి, దేవతల దినము. తులా విషువత్తు నుండి, అనగా దక్షిణాయణం నుండి రాత్రి ఆరంభమయ్యేవి. నేడు మకర కటకాలకు మారినాయనేది శ్రీవత్సాచార్యుడి మతం. ఆశ్వయుజ పూర్ణిమ, మాఘపూర్ణిమా, మాఘాష్టమీ, కూడా సంవత్సరాదిగా ఉండేవి. ఇట్లా సంవత్సరాది ఆశ్వయుజ, కార్తీక, మార్గశిర, పుష్య, మాఘ ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసాలలో మారుతూ వచ్చింది. వైదిక కాలంలో నాలుగు నెలలు ఒక ఋతువుగా, సంవత్సరానికి మూడే ఋతువులుగా భావింపబడినట్లు శతపథ బ్రాహ్మణం తెలుపుతున్నది. పైమార్పు జరగడానికి ఇదే కారణం. ఈ ఋతువులలో నాలుగు నెలల పాటు ప్రత్యేక కర్మలు జరిపేవారు. అందుకే వీటికి చాతుర్మాస్యవ్రతాలని సంకేతం ఏర్పడింది. ఆశ్వయుజ, కార్తీక, మార్గశిర, పుష్యాలు, శిశిర ఋతువుగా, మాఘ; ఫాల్గుణ, చైత్ర, వైశాఖాలు, వసంత ఋతువుగా; జ్యేష్ఠ ఆషాఢ, శ్రావణ, భాద్రపదాలు, వర్ష ఋతువుగా భావింపబడి, శిశిరాది నుండి సంవత్సరం మారుతూ వచ్చింది. ఈ మార్పును క్రీ.శ. ఐదవశతాబ్ది వాడయిన వరాహమిహిరుడు గుర్తించాడు. నూతన సంవత్సరారంభం వసంత విషువత్తు - అంటే సమరాత్రిందివ కాలంతోనే, అని చైత్రమాసమని నిర్ణయించి, మాస, ఋతు, సామరస్యం కల్పించాడు. అప్పటి నుండి సంవత్సరాది మాసం ఇదే.

ఈ పండగనాడు ఉదయమేలేచి తలస్నానం చేసి, కొత్తబట్టలు ధరిస్తారు. ఇంటిని శుభ్రపరచి, ముంగిలిని మామిడాకుల తోరణాలు మొదలైన వానితో అలంకరిస్తారు. పంచాంగాన్ని సంవత్సరాది దేవతను పూజిస్తారు. ఉగాది పచ్చడిని ఆరగిస్తారు. పచ్చడిని కొన్ని ప్రాంతాల్లో 'గొజ్జు' అనికూడా అంటారు. కొత్తబెల్లం, చింత పండు, మామిడి ముక్కలు, వేపపూత, ఉప్పు, పచ్చిమిరప ముక్కలు, సెనగపప్పు, గసగసాలు, చెరుకుపాలు మొదలైనవి. ఆఋతువు ప్రారంభంలో లభించే వస్తువులతో పచ్చడి చేస్తారు. షడ్రసోపేతమైన పచ్చడి, రాగద్వేషాలకు ప్రతీక. కష్ట సుఖాలన్నింటినీ, సమపాళ్లలో రంగరించుకుంటేనే, జీవితం అనే సత్యాన్ని మనకు సంవత్సరాదినాడే పచ్చడి జ్ఞప్తికి తెస్తుంది.

గోధుమ పిండి, పప్పు బెల్లంతోడి పూర్ణం, లేక సొజ్జలతో చేసే భక్ష్యాలు ఈనాటి వంటకాలలో ప్రత్యేకతను సంతరించుకుంటాయి.

సాయంకాలం ఇంట్లోనో, దేవాలయంలోనో, చావడిలోనో పంచాంగ శ్రవణం, జరగుతుంది, గ్రామ పురోహితుడు ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

గ్రామంలోని ప్రతివాడూ తమపేరును బట్టి, తమ గ్రహచారం ఆరోజు, ఆ సంవత్సరం యెలా వుందో తెలుసుకుంటాడు. ఆ సంవత్సరం తమ ఆదాయ వ్యయాలు, కందాయాలు, గండాలు, రాజపూజ్య రాజావమానాలు మొదలైన వివరాలు తెలుసుకుంటారు. వ్యవసాయ దారులైతే, ఈ సంవత్సరం గాలియెంత? వర్ష మెంత? పంటలెంత? ఏ పంటలకు బాగుంది? చీడ, పీడల వివరాలేమి? పశుపాలకు డెవరు? స్థాన సంరక్షకుడెవరు? మొదలైన వివరాలు తెలుసుకుంటారు. పశుపాలకుడు గోపాల కృష్ణుడైతే, ఆ సంవత్సరం తమ గోవులు పాలుసరిగా ఇయ్యవనీ, అంటే కృష్ణుడే అన్నీ తాగేస్తాడనీ, స్థాన సంరక్షకుడు అంటే దొడ్డినికాపలాకాసేవాడు యముడైతే, ఆ సంవత్సరం పశువులు చాలా చనిపోతాయని గ్రామాల్లో విశ్వసిస్తుంటారు. ఆనాడు రైతులు ఉదయమే తమ పొలాల్లో పని ప్రారంభిస్తారు. సాధారణంగా చెట్టు కొట్టడం, లొట్టకొట్టడంతో పని ప్రారంభమౌతుంది. తెలంగాణాలో ఇట్లా పనిప్రారంభించడం **'ఆయిటి'** సాగడం అంటారు. ఆంధ్రప్రాంతంలో ఏరువాక సాగడమంటారు. సాయంకాలం క్రీడా వినోదాలతో గడుస్తుంది. ఎద్దులను అలంకరించి, వాటిచే బరువులు లాగించే పోటీలను కొన్ని ప్రాంతాల్లో నిర్వహిస్తారు. 'కొత్త పెట్టడం' కూడా ఉగాదినాడు వ్యవసాయ కుటుంబాలలో జరిగే ముఖ్యమైన విషయం. కొత్తగా వచ్చిన వరి పంటను ఆరోజునుండి తినడం ప్రారంభిస్తారు. దానికీ కొంత తంతు వుంటుంది. కుదురు, లేక కుందెన, రోకండ్లు అలంకరించి జాజు, సున్నంపూసి, మామిడాకు, దారంతో కంకణం కట్టి ముత్తైదువులు కొత్త వడ్లను కుందేనలో పోసి దంచుతారు. ఇరుగు పొరుగు అమ్మలక్కలను ఆరోజు ఇంటికి భోజనానికి పిలుస్తారు. వండిన యేవస్తువూ ఆరోజు బయటికి పోకూడదు. అక్కడే తిని పోవాలి. కొత్త బియ్యం అన్నం, కొత్త చింతపండుతో చేసిన పచ్చిపులుసు ఈ కొత్తపెట్టినరోజు ప్రధాన వంటకాలు .

వసంతాన్ని తనవెంట తెచ్చే ఉగాది తెలుగు కవిత్వంలో కవుల హృదయాల్లో ముఖ్యమైన చోటు సంపాదించుకున్నది. ప్రకృతి కవులకైతే, వసంతం లేనిది కవిత్వమే లేదు. శిథిలమైన ప్రకృతికి నవచైతన్యాన్ని కలిగించే వసంత ఋతువును వర్ణిస్తూ, మానవ జీవితంతో సైతం పూవులు పూయాలని ఆకాంక్షించే కవులు, తమ కవితలద్వారా వసంత గానం చేస్తుంటారు:

**"ప్రొద్దుగ్రుంకెడు వేళ ముగ్ధభావ ప్రచా**
**లిత ప్రియ హస్త. గుంఫితములగుచు,**
**రేయి. వడ్డన వేళ ప్రియురాలి చొళ్లమ్ము**
**పైని ముద్దులు గుల్కు బంతియగుచు,**
**పరనిరా మధుర సంభ్రాంతి గృహీత**
**ప్రేయసీ ధమ్మిల్ల మృదువులగుచు,**
**మరునాటి ప్రొద్దున మండువాలో నిర్ద**
**శితములై యిల్లు బాలింతలగుచు,**

**పగలు రెండు జాములవేళ పంచపాత్ర**
**వారిపై దేలియాడు పూ బడవలగుచు**
**నిఋతి దిగ్వాయవతి వసంత ఋతు శోభ**
**లీను చూలాంధ్రు మల్లె పూ వెనక మెసగె".**

అన్నారు విశ్వనాథ తమ తెలుగు ఋతువుల్లో; రాశిలో, రమ్యతలో తనదైన ప్రత్యేకతను సంతరించుకున్న నారాయణరెడ్డి - ప్రకృతి ధర్మాన్ని, మానవ జీవితానికి అన్వయిస్తూ-

"చెట్టు చిగురిస్తే ఉగాది" - అంటారు.

**"ఒళ్లు మండినా**
**కళ్లల్లో దుమ్మునిండినా**
**వేళ్లు పెరుక్కోదు చెట్టు;**
**పాతుకు పోయిన పాదాలతోనే**
**ప్రశ్నిస్తుంది కొమ్మల గొంతులెత్తి**
**పరిగెత్తుకు పోయి, తలబాదుకుని**
**విరిగి పోతుంది కడలి కెరటం.**
**స్థిరంగా నిల్చొని.**
**పరిస్థితుల్ని ఎదుర్కొని**
**'ఫల' ప్రదమవుతుంది వృక్షం**
**చెట్టు పరవశిస్తే చిగుళ్ళ 'ఉగాది'**
**చెట్టు పరితపిస్తే శిశిర నిశీధి."**

అంటాడు. మానవ జీవితానికి కావలసిన స్థిరత్వాన్ని చెట్టు నుండి నేర్చుకొమ్మని ఉగాది సందేశమిస్తాడు.

వసంతం గురించి చెప్పినా, వడగాడ్పుల గురించి చెప్పినా, సమానంగా రసానుభూతిని కలిగించడం **దాశరథి** ప్రత్యేకత: ఉగాదినాడైనా చిగురాకుతో చేతులు కలుపుదామని ఆహ్వానిస్తాడు గ్రీష్మకిరీటంలో.

"గుండె పగిలిన సామాన్య మానవుడు
అండకోసం ఆకాశం వైపు చూస్తున్నాడు...
మండించినా ఎండించినా
మనదేగా ఉగాది;
నిండు గుండెతో స్వాగతం చెప్పక
ఎందుకు వేరే సోది;
ఎగరేయండి ఎండల జండాలు దండిగా
చిగురాకులు ఉగాదితో
చేతులు కలపండి నిండుగా!"

అంటాడు. ఎన్ని కలతలున్నా ఏకసూత్రంలో బిగించబడి వుండడమనే సందేశం, ఈ ఉగాది కవితది.

ప్రపంచంలోని చాల దేశాల్లో ఉగాది జరుపుకొంటారు. పేర్లు వేరు; పద్ధతులు వేరు.

తరతరాల మన సంస్కృతిలోని అన్ని విధానాల్లో ఉగాది అవినాభావంగా అంతర్లీనమై ఉంది.

ఇది శ్రీముఖ ఉగాది.
ఈ శ్రీముఖ
సంపత్ శ్రీముఖమై
శాంతి శ్రీముఖమై
సౌమనస్య శ్రీముఖమై
విలసిల్లాలని ఆకాంక్షిద్దాం.
"సర్వేజనాః సుఖినః భవన్తు"

ఆలిండియా రేడియో
24-03-1993
శ్రీముఖ ఉగాది.

రుక్నుద్దీన్



# హంపీక్షేత్రం.

మోదములోన మోదమయపోదురు,
ఖేదములోన ఖేదమైపోదురు,
సర్వమున్ కరగిపోవును వారల దృష్టి;
వారి యాహ్లాద వినోదముల్
కడు విలక్షణముల్
కవులన్న
నిత్య సూర్యోదయ కాల
మానస సరోవర హంస లటుల్ రస ప్రియుల్

ప్రపంచంలోని సుఖదుఃఖాలను తనవిగా భావించి, దర్శించి అనుభూతిని పొంది, హృదయఫలకం మీద ఎన్నోమార్లు సవరించి, కవి తాను దర్శించిన దానినే చిత్రిస్తాడు. ఎన్నిమార్లు ఎక్కువగా దర్శిస్తే, విషయ చిత్రణలో అంత పరిపక్వత సాధ్యమౌతుంది.

కొడాలి వేంకట సుబ్బారావు హృదయ సంస్కారంగల భావుకుడు. మొట్ట మొదట ఆయన చరిత్రాభిమానీ; చరిత్ర బోధకుడు. ఆ యభిమానంతోనే ముప్పది రెండుసార్లు హంపీక్షేత్ర శిథిలాలను, చరిత్రగతిలో మిగిలి పోయిన అవశేషాలను, భౌతికంగా దర్శించాడు. మననం చేసికొన్నాడు. గతంలోని ఆయా సంఘటనలకు లంకె కుదుర్చుకున్నాడు; ఈ పరిశ్రమలో, ఆతనిలోని కవి హృదయం మేల్కొన్నది. చారిత్రకానుభవం సంఘటనలను తవ్వి కుప్పవోస్తే, కవి హృదయం ఆ కుప్పను తూర్పార బట్టి, చెరిగి నిగ్గు దేల్చి రాళ్లనుండి రత్నాలను వేరు పరచి, కావ్య నిర్మాణం చేసింది. ఆ నిర్మాణమే హంపీక్షేత్రం.

## ఇది క్షేత్ర ప్రశస్తి కావ్యమే గాక, స్మృతి కావ్యము కూడా

సుబ్బారావు సంధియగంలోని కవి; భావకవితా ప్రభావం అధికంగా కలవాడు; ప్రతిభకు దేశభక్తి తోడైన వాడు; ప్రకృతి చిత్రణ గతవైభవ స్మృతి, దేశభక్తి వీరి రచనలలో స్పష్టంగా గోచరిస్తాయి హంపీక్షేత్ర కావ్యం వీర రస స్ఫోరకమై, ఆధునిక చారిత్రక కావ్యాలలో ప్రత్యేక స్థానాన్ని పొందింది.

జంట కవిత్వానికి ఆనాడున్న గౌరవం హంపీక్షేత్ర రచనలో కొడాలి వేంకట సుబ్బారావు పేరుతో - కామరాజు గడ్డ శివయోగానందరావు పేరును కలిపింది.

శెలిమె

ఆంధ్రాభిమానం, దేశ, భాషాభిమానాలు, గత వైభవస్మరణం, వర్తమాన స్థితి పట్ల విచారం, భవిష్యత్కర్తవ్య ప్రబోధం మొదలైన ముఖ్యలక్షణాల పునాదులపై ఆధారపడి నిర్మించబడిందే హంపీక్షేత్రం.

విజయనగర సామ్రాజ్య స్థాపన; నగర నిర్మాణం, విద్యారణ్యులు, రాజ్యప్రదానం, తళ్ళికోటయుద్ధం, హంపీస్థాపన, రాయల రమ్య జీవనానికి తిమ్మరుసు దోహదం, వక్రించిన విధి, తిమ్మరుసుకు శిక్ష; రాయల పశ్చాత్తాపం మొదలైనవి. శ్రీకృష్ణదేవరాయల కీర్తి. జీవితయానంలోని నిమ్నోన్నతాలు. ఈ సంఘటనలన్నీ హంపీక్షేత్రంలో సందర్భానుకూలంగా రసరంజితాలౌతాయి. ఓహో! అనిపిస్తాయి; చివరకు కంటతడి పెట్టిస్తాయి; అయ్యో! విధి యెంత దయలేనిది! అనిపిస్తాయి:

కవి క్రాంతదర్శి. భూత, భవిష్యత్, వర్తమానాలను ఏకకాలంలో దర్శించగలుగుతాడు. దర్శించిన దాని కనుకూలంగా స్పందిస్తాడు. తన స్పందనలను లోకం మీదికి ప్రసరింప జేసి, లోకాన్ని స్పందింప జేస్తాడు; అసలుసిసలైన కవి చేసే పని అదే!

అందుకే సుబ్బారావు ముందు, శిథిలావస్థలో నున్న హంపీ శిథిలాల్లోని-

**"శిలలు ద్రవించి యేడ్చినవి;**
**జీర్ణములైనవి తుంగభద్ర లోపల గుడిగోపురంబులు;**
**సభాస్థలులైనవి కొండముచ్చు గుంపులకు;**
**చరిత్రలో మనిగిపోయనది ఆంధ్రవసుంధరాధి పోజ్వల**
**విజయ ప్రతాప రభసంబొక స్వప్న కథా విశేషమై".**

శిలలు కవిని చూసి యేడ్చినవి, కవి శిలలను చూచి యేడుస్తాడు; పాఠకులనూ, శ్రోతలనూ యేడిపిస్తాడు. ఔరా! అనిపిస్తాడు. అదే సహృదయతా, రసానుభూతి, తాదాత్మ్యతకు తార్కాణం.

హంపీ శిథిలాలను పలుమార్లు దర్శించిరి. తర్వాత కొడాలి కవి హృదయానికి, అక్కడి ఒక్కొక్కశిథిలం, ఒక్కొక్క చారిత్రక ఘట్టాన్ని వివరించింది. ఆ వివరణే- కావ్యంలో రూపు దాల్చింది.

**ఈ జీర్ణ కుగ్రామ మేమి చూపించును?**
**తెనుగు రారాజు పండిన యశస్సు;**
**ఈ..... దిబ్బ యందేనీతి నిలుచును?**
**రాకాసిరేడంట రాని మంట;**
**ఈ పాడుగుళ్ళలో ఏమి శేషించెను?**
**తెలుగు భక్తుడు కత్తి తెగిన యెరుపు;**



**ఈ కొండకోనలందేమి శబ్దించును?**
**వాల్మీకి యమృతంపు వాన చినుకు;**

**భారతీయ పురాణ రూపముల లోన**
**తెలుగు సామ్రాజ్యమును వన్నెదిద్దుకొనెను**
**జీర్ణ విద్యామహారణ్య సీమ యందె...... అని**

కనులకు కట్టినట్లుగా వర్ణించాడు. చరిత్ర లోతుల్లోకి తొంగి చూచి, చిత్రించగల కొడాలి ప్రతిభకిది మచ్చుతునక.

తిమ్మరుసు ఉదాత్తుడైన కర్మయోగి. అతనిని రాయలు అట్లే దర్శించాడు. ఆదరించాడు. కాని; ఆవేశం, దురవగాహన అతని వివేకనేత్రంపై చీకటి తెరదించి, అఘాయిత్యానికి పురికొల్పింది. జరగరానిది జరిగిపోయింది. నిర్దోషియైన అప్పాజీ శిక్షకు లోనైనాడు. కానీ, రాయల మనోనేత్ర ఫలకంపై పూర్వపు అప్పాజీయే దర్శన మిచ్చినట్లయింది. తనను తర్జించినట్లయింది; రాయలకు తన జీవితంలోని ఒక్కొక్క సంఘటనా కళ్ళముందుకు రావడం ప్రారంభమయింది.

మంచి చేసిన వారికి మంచే కలుగుతుందనేది లోకరీతి; కానీ నేను రాజుకు అంతా మంచే చేశాను,

నాకు ప్రతిఫలంగా లభించిందేమి! ఎందుకిలా జరిగింది! ఇదిదైవ ఘటనయా! అనుకుంటాడు అప్పాజీ.

**పెంచితి; పెద్ద చేసితి;**
**అభీప్సిత సిద్ధికి జీవవాయులర్పించితి**
**మొన్నదాకా;**
**ఇపుడు పెద్ద తనంబున**
**లేనిపోని కల్పించిన వాదుకై**
**పరిభవించి కనుల్డులిపించె భూపుడు....**

అని అప్పాజీ రాయల కళ్ళముందే కదలాడుతూ గొణిగినట్లనిపించింది. అయినా, జరిగిందానికి రాయలను నిందించక-

"ఈ వంచననీ పరీక్ష తగవా పగవాడవ శ్రీవధూధవా!" అని దైవాన్ని అన్నాడే తప్ప. రాయల నేమీ అనలేదు. పెంచిన ప్రేమ గొప్పతనం అది.

పామంటే 'పడగ' అనేది లోకరీతి;

అప్పాజీపై అపనింద పడగానే-జనం ఊహలకు రెక్కలొచ్చి నలుగురూ నానా విధాలుగా వ్యాఖ్యానాలు చేసినారు:

**"ఆతనికేమి వచ్చినది!!**
**అంతయు తీరిన వెన్క రాజ్యమున్ చేతునటన్న ఆశ!**
**మతి చెడ్డది పో!!**
**యువరాజు చావగానే తన కబ్బునా పదవి!**
**నేటికి పాపము పండిపోయె;**
**అయ్యో! తనవంటి, వానికిదియా తగు బుద్ధి!**
**వినాశకాలమే"-**

అని తోచినట్లల్లా అన్నారు. నాలుకకు నరం లేదనిపించుకున్నారు.

వాస్తవాన్ని వాస్తవంగా చూడగలిగే వారూ ఉంటారు అన్ని కాలాల్లో

తిమ్మరుసు కళ్ళు పెరికించి, నీరూ ఆహారమూ ఇవ్వక, బంధించి, చంపారని ప్రతీతి. ఆ సంఘటనకు స్పందించిన ఆనాటి వారి భావం ఇక్కడ చోటు చేసికొన్నది.

**ఒక్క మాటుగ తల నూడగొట్టిన పోద**
**బలవన్నృతికి ఏల పాలు చేయ?**
**ఎంత చేసిన నేమి ఈ రాచవారికి**
**తుదకిట్టి దురవస్థ తోడి చావె?**
**ఆతడొనర్చిన మహత్తర సేవలోనెంచి**
**క్షమియించు బుద్ధి లేదేమి తనకు?**
**తనకు రాజ్యంబేమి తగుల బడ్డది?**
**అంత**
**అతని చేతనె: దక్కినట్టిది గద!**

**కావలయునన్న**
**రాజ్యమునకై నిసుంగు ప్రాణముల తీయగానేల**
**పార్థివునకె నీళ్ళు తోడడా!**
**అంచు - అనేక గతుల**
**భూపుని కృతఘ్నతకు - మంత్రి పొందినట్టి**
**మహదవస్థకు లోలోన మరగిపోయి**
**ఒకరనిన మాట కూడ వేరొక్కరనక పోయినారు**
**ప్రజలు క్రోధ పూరితాత్ములు**
**అంతలో కృపా పూరితాత్ములు.**



తన తొందరపాటుకు పశ్చాత్తప్తుడైన రాయలను తిమ్మరుసు ప్రశ్నించినట్లు తోచిన భావచిత్రణ -

**ఈ రక్తపుంబొట్టు నెవరు పెంచిరటన్న**
**'అప్పాజి' అనురోజు లరసి కొనుము;**
**చనిపోవు తండ్రి యెవ్వని కప్పగించె నాన్**
**'అప్పాజి' కనుమాట లరసి కొనుము.**
**ఆ మహాసామ్రాజ్య మంతనీ గెల్వనాన్**
**'అప్పాజి' శక్తి యంటరసికొనుము**
**ఆ మహారాణి పెండ్లాడిన దెట్లనిన**
**'అప్పాజి' యుక్తి యంటరసికొనుము....**

అని రాయల జీవితంలోని సంఘటనలన్నీ అప్పాజీ చొరవ వల్ల లభించినవే కావడం వల్ల రాయలను అప్పాజీ తర్జించి అడిగినట్లనిపించింది. రాయలు పశ్చాత్తప్తుడైనాడు. కృశించి-తానూ తనువు చాలించాడు.

**దివాంతంబు తోడను,**
**రాజన్యుని ప్రాణవాయవుల తోడన్**
**తిమ్మరాణ్మూర్తి పోయినది.**
**ఆంధ్రావని కంటి నీరిగిరి పోయింది**
**అంతరాగ్నిచ్ఛటన్ -**

అని-ప్రస్తుత దేశ పరిస్థితిని వివరిస్తాడు కొడాలి హంపీక్షేత్ర కావ్యంలో.

హంపీక్షేత్ర కావ్యం చదువుతున్నపుడు శిథిలాల మధ్య తిరుగాడినట్లు కాదు.. అలనాటి రాజ వీధుల్లో విహరించిన అనుభూతి కలుగుతుంది. కావ్యం మొదటి ప్రయోజనం అదేకదా!

'హంపీక్షేత్రం' క్షేత్ర ప్రశస్తి కావ్యం. ఇది స్మృతి కావ్యం కూడాను. సులభసుందర శైలి; ద్రాక్షాపాకం. గతవైభవాన్ని కళ్ళకు కట్టించేది. సహృదయులను కంపింపజేసేది.

విశ్వనాథ వారి మాటల్లోనే చెప్పాలంటే - హంపీక్షేత్ర కావ్యంలో. "కథా వస్తువునకు సంబంధించని అనవసరమైన ఒక్క అక్షరము లేదు. కావ్యము వెదకిచూచినను ప్రత్యక్షరము, ప్రతి శబ్దము. ప్రతి వాక్యము, ప్రతి అలంకారము, కావ్యరసోన్ముఖముగానే పరుగెత్తును. శిల్పము లేదు"- హంపీక్షేత్రం తెలుగు సాహిత్య జగత్తులో ఉదాత్తకావ్యం అనడానికి విశ్వనాథవారి పై వాక్యాలు చాలు.

**ఆలిండియా రేడియో సౌజన్యంతో...**

# అక్కినేని మరువలేని పాత్రలు

# ఏడంతస్తుల మేడ

**"ఆంగికం భువనం యస్య**
**వాచికం సర్వ వాఙ్మయమ్**
**ఆ హార్యం చంద్ర తారాది**
**తం వందే సాత్త్వికం శివమ్"**

భువనం ఆంగికమై, సర్వవాఙ్మయమ్ వాచికమై చంద్రతారాదు లాహార్యమైన ఆ మహానటుని స్తుతి ఈ మహానటుని ప్రస్తుతి వేళ సమంజస మనుకుంటాను.

**విశ్వశ్రేయః కావ్యమ్..**

కావ్యం ప్రధానోద్దేశం విశ్వశ్రేయస్సాధనమే.

అది శ్రవ్యకావ్యమైనా, దృశ్యకావ్యమైనా, దాని పరమావధి విశ్వశ్రేయమే. ఐతే - 'కావ్యేషు నాటకం రమ్యం' అని విషయజ్ఞులు నిర్ధారించినారు. నాటకం సకల కళల సమాహారం. చతుశ్షష్టి కళలూ, ప్రత్యేకించి లలిత కళలు నాటకంతో నర్తనమాడుతుంటాయి. అందువలననే నాటకం సమహార కళ అయింది.

ఆధునిక యుగంలో నాటకమే రూపాంతరం చెంది 'సినిమా' గా రూపాంతరం దాల్చింది. సినిమా బలమైన ప్రచార ప్రసార సాధనంగా రూపొందింది. బహుళజనాదరణ పొందిన కళగా 'సినిమా' రూపుదాల్చింది. ఆంధ్రప్రదేశ్‌లో దేశంలోకెల్లా అత్యంతాదరం పొందిన కళగా సినిమా రూపొందిందంటే, గర్వించదగిన విషయమే.

తెలుగు కళామతల్లి ముద్దుబిడ్డలలో అక్కినేని ప్రముఖులు. ఆయన యే పాత్రపోషించినా, దానికి జీవంపోస్తారు. తల్లీనులౌతారు. ప్రేక్షకులను మైమరిపింపజేస్తారు. ఒకదేవదాసు, ఒకబాటసారి, ఒక అర్జునుడు, ఒక పూలరంగడు, ఒక దసరాబుల్లోడు, ఒక ప్రేమ్‌నగర్ మరొక ఏడంతస్తులమేడ. ఏదైతేనేమి పోషించిన పాత్రను పదికాలాల పాటు, ప్రేక్షకుల హృదయాలలో బ్రతికింప జేయడమే, ఆయన ప్రధాన లక్ష్యం. ఆ లక్ష్యసాధనలో కృతకృత్యుడయిన పథికుడాయన.

కళ కళ కొరకే కాదు; కళ సమాజ సంక్షేమ సాధన కొరకని విశ్వసించే దర్శక రత్న దాసరి నారాయణరావు చిత్రాలన్నిటిలో ఓ ప్రత్యేకత వుంటుంది. సంతోషంకొరకో, సంపాదన కొరకో, టైంపాస్ కొరకో, మరింక దేనికొరకో కాదు వాటిన్నిటితోపాటు ఒక సందేశాన్ని సమాజానికి యివ్వాలనే తపనతో చిత్ర దర్శకత్వం వహిస్తారు దాసరి. ఆ వరుసలో రూపొందిన చిత్రరత్నమే ఏడంతస్తుల మేడ, అందులో వైవిధ్యమున్న రెండు పాత్రలను పోషించి, ఔరా! అనిపించిన వారు అక్కినేని నాగేశ్వరరావుగారు.

సాధారణంగా సమాజంలో కనబడే వైవిధ్యాలు ఈ చిత్రంలో పొందు పరచబడినాయి. ఆలోచనా సరళిని బట్టి యేడురకాల మనస్తత్వాలు యిందులో కనబడతాయి.

విద్యావంతుడైన నిరుద్యోగ యువకుడు ప్రాథమికావసరాలు కూడా తీరని దశ. కాకతాళీయంగా జరిగిన పరిచయం, పెళ్లి, ఇంకా బాధ్యతలను పెంచినాయి. ఈ సందర్భంగా ఎదురైన ఇబ్బందులూ, అవమానాలు, ఆతనిలో పట్టుదలనుపెంచాయే తప్ప, బాధ్యతల నుండి పారిపోనీయలేదు:

**కందుకము వోలె సుజనుడు**
**క్రిందంబడి మగుడమిదికిన్నెగయు సుమీ!**
**మందుడు మృత్పిండమువలె**
**క్రిందంబడి యణగియుండు కృపణత్వమునన్**

అది సుజనుల లక్షణము. ఈ చిత్రంలో ఇదొక పాత్ర మనస్తత్వం.

ధనం లేకపోవడం వల్ల కలిగిన యిబ్బందులు 'ధనమేరా అన్నిటకీ మూలం' అనిపించి ధనార్జన పథంలో పరుగులు తీయించిన వైనం రెండవపాత్రది. అందులో అన్నీమరచి పోయాడు. అన్నీ వదలుకొని తనజీవితంలోకి ప్రవేశించిన సహధర్మచారిణిని సైతం నిరాదరణ పాలు చేసింది ధనార్జనకాంక్ష. ఇది రెండవ పాత్ర మనస్తత్వం. దీనివల్ల తోడునే కోల్పోయి యేధనమూ భర్తీచేయలేనంత నష్టపోయాడు రంగారావు. ధనం వెంట పరుగులుతీసే మనస్తత్వాలకు యిది చురక.

**ధనం గొప్పదే, కాని**
**అదే సర్వస్వంకాదు, అనే**
**పరిపక్వదశకు చేరిన విజ్ఞత,**
**ఆ మనస్తత్వం మూడవ దశలో కనబడుతుంది.**
**ఇదే అసలైన దశ.**

తాను తప్పటడుగు వేసి జీవితంలో తిరిగి పొందలేని నష్టానికి గురైనాడు. తనకష్టం తన కుమారునికీ, సమాజానికీ, మార్గదర్శకం కావాలి; తనకు కలిగిన కష్టాల్లాంటివి మరింకెవరికీ రాకూడదనే తపన నాలుగవ దశలో స్పష్టంగా కనబడుతుంది. అదికొవ్వత్తిలాంటిది.

చిత్రంలో అక్కినేని రంగారావు పాత్రలో ఈ నాలుగు వైవిధ్యాలున్న మనస్తత్వాలను ప్రదర్శించారు.

జీవితంలో ఎపుడూ తాగనివానికంటే, తాగి మానేసిన వాడే గొప్ప అని, అనుభవంతో వచ్చిన పాఠాలు శాశ్వతమైనవని, నిగ్గుదేల్చి కష్టపడిన వానికే తెలుస్తుంది. సుఖాల విలువ; ఆకలి కొన్నవాడికే తెలుస్తుంది. ఆహారం విలువ అని నిరూపించినారు. అక్కినేని ఈ పాత్రలో.

ఇక

కుమారుడుగా అంటే చినబాబుగా అక్కినేని పాత్ర-మూడు విధాలుగా దర్శించడానికి అవకాశం కలిగిస్తున్నది.

**బాధ్యత తెలియని విలాసవంతుడైన**
**జల్సారాయుడు**
**మగువ మద్యం మార్గ దర్శనంచేస్తే**
**తైతక్కలాడే వాడు-**
**కైపెక్కి పాడే వాడు**

"అనుభవిస్తే ఋతువులారు వసంతాలే అది మరిస్తే రుచులారు నీ రసాలే" అనేవాడు ఐనా-తండ్రిగారి మీద అపారగౌరవం కలవాడు. ఇదొక మనస్తత్వం.

**పిల్లవాడు ఎంత ఆరోగ్యవంతుడైనా**
**తల్లి దండ్రి జాడ్యం కొంతైనా సంక్రమిస్తుంది**
**ఆతనికి;**
**విపరీతంగా డబ్బు సంపాదించాలి అనేది**
**ప్రమాదకరమైన జాడ్యం-**
**అదే జాడ్యం సోకి-**
**ప్రాణప్రదంగా - యేరి - కోరి - యెంచుకున్న**
**ప్రియురాలిని సైతం నిరాదరణకు గురిచేసే**
**దశకు చేరడం**
**రెండవ దశ.**
**కన్నతండ్రి హెచ్చరికతో**
**తన తప్పు తెలుసుకుని**
**శ్రీమతిని సమాదరించిన**
**సంస్కారం పరివర్తన హృదయం**
**మూడవ దశ.**



దశలు యేడు కనబడినా -యేదానికది దాని ప్రత్యేకతను కలిగియున్నవే. నటుడు మాత్రం ఒకడే ఆయా మనస్తత్వాల్ని పోషించే సమయంలో మిగతా ప్రపంచాన్ని మరచి - తల్లీనుడు కావడం కేవలం అక్కినేనికి మాత్రమే సాధ్యమయింది. అవుతుంది.

ఏడంతస్థుల మేడ చిత్రంలో అక్కినేని పోషించిన పాత్రలు ఆయా సన్నివేశాల్లో ఆయన నటనా కౌశలమూ, ఆంధ్ర ప్రేక్షకుల హృదయాల్లో కలకాలం పదిలంగా ఉండిపోతాయి. ఏ సన్నివేశానికి ఆ సన్నివేశమే సాటి. అక్కడ అక్కినేని తప్ప మరొకరు నటించలేనిది.

భార్య జానకి రోగగ్రస్తురాలై మంచం పట్టింది. ఇది తినాలి ఇది తినకూడదని నియమాలు ఆమెపై విధించారు డాక్టరు. ఆమెకేమో అన్నీతినాలనే తపన. ఎవరూ లేనపుడు, సేవకుడిని గదమాయించి, జిలేబీ మొదలైన స్వీట్లు తెప్పించి, చేతికందుకొని తినబోతుంది ఆమె. అపుడే ప్రవేశించిన అక్కినేని ఆమెను ఆప్యాయంగా వారించి, నోటిదగ్గరి నుండి జిలేబీని సుతిమెత్తగా తీసిపడవేసి. ఉప్పులేని గంజిని చిన్నగిన్నెలోపోసి, ఆమె నోటికందించి తాపుతూ-

**"అన్నీ తినగలిగినపుడు తినడానికి యేమీ లేవు.**
**తినడానికి అన్నీవున్నపుడు, నీవు తినలేవు,**
**ఇదే విధి విచిత్రమంటే" -అని**
**ఎడంతస్థుల మేడ యిదీ,**
**వడ్డించిన విస్తరదీ,..... అని పాడుతూ**

ఆమెను అనునయిస్తూ చేసిన నటన, నభూతోనభవిష్యతి. ఆయన ముఖంలో ఓవేదాంతి, లోకాలను అర్థం చేసుకున్న ఓ అనుభవజ్ఞుడూ కనబడతారు. ఆమెను ఆదశలో అనునయిస్తున్నపుడు అంతులేని ఆవేదన అతని హృదయంలో. అది ప్రేక్షకులకు తెలియాలి. కాని ఆమెకు తెలియకూడదు. ఏక కాలంలో ఈ రెండు భావాలను సమర్థవంతంగా వ్యక్తం చేయగల అభినివేశము అక్కినేనికి మాత్రమే వుంది. ఆ దృశ్యం ప్రేక్షక రసహృదయాల నుండి ఏనాటికీ చెరిగిపోదు.

నీవు డబ్బు వెంట పరుగులు తీసేవాడవు, నీజాడ్యం నీకొడుక్కూ వుంటుంది. ఆ జాడ్యం వున్నవారు భార్యా బిడ్డలనేల సుఖపెడతారు? అందుకని నీకొడుకుకు మా అమ్మాయిని యివ్వను అని జగ్గయ్య అన్నపుడు-ప్రపంచంలో యేకోడలూ సుఖపడనంతగా నీ కూతురు మాయింటిలో సుఖపడుతుందని, (రంగారావు) అక్కినేని ప్రాధేయ పడతాడు. తన కొడుకూ తనలాంటి వాడేననీ, అతనూ సుఖపడాలనీ. ఆ సుఖాలను తండ్రిగా తాను సమకూర్చాలనే తపన అక్కినేని నటనలో స్పష్టమౌతుంది. పిల్లల సుఖాలను కాంక్షించే తండ్రిగా అక్కినేని పాత్రపోషణ మరువలేనిది.

పూర్తిగా తండ్రి లక్షణాలేవచ్చి, సంపాదన వెంటపరుగులు తీస్తూ, జీవితాన్ని చిందర వందర చేసుకోబోతున్న కుమారుడిని, గీతోపదేశం లాంటి ఉపదేశం చేసి, జీవితానుభవాన్ని అంతా నాలుగుమాటల్లో చెప్పి, భార్య ననునయించడానికి పంపించగలిగిన పరిణత వ్యక్తిగా అక్కినేని అభినయం అద్వితీయం. ద్వార బంధాన్ని అనుకొని కుమారుడికి ఆయన చేసిన హితుబోధలో చిన్నవాడివి, నీకేం తెలియదు; అనే భావం ముఖకవళికలలోనే వ్యక్తపరచి, కొడుకును తీర్చిదిద్ది కార్యోన్ముఖుని జేసిన వైనం, దృశ్యం, తరతరాలవరకు చెరిగిపోని ముద్రవేస్తుంది. సహృదయుల హృదయాలపై.

ఇట్లాంటి మరువలేని సంఘటనలెన్నో వున్నాయి- ఏడంతస్థుల మేడ చిత్రంలో అక్కినేని పోషించినవి.

ఈ చిత్రంలోని గీతాల గురించి ముచ్చటిస్తే వైవిధ్యం కలిగిన నాలుగు గీతాలు ప్రధానంగా కనబడతాయి:

**చక్కనిచుక్క...**
**యెక్కడంటే ... అక్కడ**
**తైతక్కలాడుతు వుంటాను**
**కై పెక్కి ఆడుతువుంటాను...**

అనే గేయం ఆధునికులు బాగా ఆదరించేది. డిస్కో బ్రేకులు యిష్టపడుతున్న యువతకు గిలిగింతలు పెట్టేది-యీ సన్నివేశం, గీతం, నటన.

**ఓ నా రంగీ**
**రంగి రంగి రంగీ!...**

అనే గేయం అక్కినేనిలో దాగివున్న జానపద కళాకారుని పట్టియిచ్చేది. వేషం వేరైనా

**'ఎట్టాగో వుంటాది ఓలమ్మో**
**ఏటేటో అవుతుంది చిన్నమ్మో' అని**

గంతులు వేసే మనస్తత్వం యీ గేయాన్ని పోషించిన వైనంతో కనబడుతుంది; అరవైలో ఇరవై అన్నట్లుగా ఎనభైలో పద్దెనిమిదిని పోషించిన కీర్తి, నైపుణ్యం అక్కినేని సొంతం.

**"ఇది మేఘసందేశమో**
**అనురాగ సంకేతమో ...."**

అనేది మరో గేయం, ఉదాత్త నాయకుడు, సంప్రదాయరీతిలో, భావకవితా ఛాయలతో - పాడినదీ గేయం. సంస్కారవంతుడైన సంప్రదాయ భావుకుడు, ప్రేమికుడు, యువకుడు దర్శనమిస్తాడు. యిక్కడ.

ఈ చిత్రాన్ని ఇంత గొప్పదానిగా తీర్చిదిద్దింది, రసికహృదయాలలో ఆలోచనలు రేకెత్తించిందీ-

**టైటిల్ సాంగ్-**
**"ఏడంతస్తుల మేడ యిదీ**
**వడ్డించిన విస్తరిదీ ...." అనేగేయం.**

ఈ చిత్రంలో ప్రముఖంగా రెండు సార్లు యీ గేయం కనబడుతుంది, వినబడుతుంది. మొదటి సారికంటే రెండవసారికే యెక్కువ ప్రాధాన్యత కలిగి వుంది.

జీవితం సారాంశమంతా నిండివుంది గేయంలో

**చేతుల్లో నింపితే గోదారైనా దోసెడే**
**అద్దంలో నిలిపితే కొండైనా కొంచమే**
**అంతులేని యీ లోకంలో ఆరడుగులే మనవి**
**తృప్తి అనే దొక్కటే ముక్తి మనిషికీ-**

అనే గేయం హృదయం లో తులను కలచివేస్తుంది. వేదాంతసారాన్ని వివరిస్తుంది. How Much Land Man needed అనే టాల్‌స్టాయ్ కథ తళుక్కుమంటుంది.

**వ్యాప్తిం జెందక వగవక**
**ప్రాప్తించిన లేశమునకె పదివేలనుచున్**
**తృప్తిం జెందని మనిజుడు**
**సప్తద్వీపములనైన చక్కంబడునే!... అనే**

భాగవతకారుని నీతిసూక్తి గోచరిస్తుంది. జీవిత పరమార్థాన్ని పట్టి యిస్తుంది.

అక్కినేని ఉత్తమోత్తముడైన కళాకారుడే కాదు, ఆయన మహా తపస్వి: అనంగానే గడ్డాలు, మీసాలు పెంచుకొని ఎక్కడో అడువుల్లో మానవుల దృష్టికి రాకుండా వుండడం స్ఫురిస్తుంది. కాని మన అక్కినేని అల్లాంటి తపస్వికాదు: మరీ...

చిత్రంలో ఉదాత్తనాయకుని కుండవలసిన ప్రధాన లక్షణం శరీర నిష్పత్తి. శరీరసౌష్ఠవం. అది ఆయనకు ప్రకృతి ప్రసాదమే. కాని ఎనిమిది పదులు సమీపిస్తున్నా ఆ ప్రసాదాన్ని పదిలంగా ఆయన భద్రపరచడం వెనకవున్న రహస్యం ఆయన తపస్సు.

ఆయనకు అన్ని హంగులూ వున్నాయి: అనవసరమైన అన్నిటినీ ఆమడదూరంలో వుంచడమే నిష్ఠ. తపస్సు, అది కళకొరకు తపస్సు. సామాజికుని కొరకు తపస్సు. విశ్వశ్రేయస్సు కొరకు తపస్సు. సామాజికుని సంతృప్తి కొరకు తనను తాను తపింపజేసుకోవడమే తపస్సు. వాని సంతోషం కొరకు తాను తపింపచడమే తపస్సు. అందుకే అక్కినేని మహాతపస్వి.

అక్కినేని మహోన్నత కళాకారుడు. అవార్డులన్నీ ఆయనను చేరి గౌరవించబడినవి. అంతటి నైపుణ్యాన్ని పరిచయం చేయడానికి మరొక అక్కినేని కావాలి, అంతేకాని నాలాంటి సామాన్య వ్యక్తికి వీలయ్యేదికాదు. ఐతే స్థాలీపులాక న్యాయంగా లభించిన అవకాశాన్ని వినియోగించుకోవడమే నేను చేస్తున్నపని.

ఉత్తమ కావ్యం ప్రధాన లక్ష్యం సమాజానికి మహోన్నత సందేశాన్నివ్వడమే. ఏడంతస్థుల మేడ ఉన్నతమైన దృశ్యకావ్యం. సంపదల భ్రమలో పడి జీవితాలను, మానవత్వాన్ని మంట గలుపుకోవద్దనేదే - ఈ కావ్యమందలి దివ్యసందేశం. ఈ సందేశాన్ని తాను కర్తగా, లోకంలోని సాధారణమైన ఏడుప్రవృత్తులతో నిరూపించిన మహానటుడు అక్కినేని. అది మరువలేని పాత్రపోషణ.

అక్కినేని నిత్యనూతనుడు. ఆయన పుట్టిన తేదీకి (Date of Birth) వయసు మళ్లుతుందే తప్ప ఆయన శరీరానికీ, ఆయన మనస్సుకూ నిత్యనూతన యవ్వనం. అందుకే ఆయన యెపుడూ పైలాపచ్చీసే.

ఏడంతస్థులమేడ పేరులో రూఢిగా వినబడేది, కనబడేది, ఒక పెద్దభవనం, హోదా, దర్జా. కాని బాగా ఆలోచిస్తే జీవితమే ఒక పెద్దమేడ. ఎగుడు దిగుళ్లు ఎన్నోవుంటాయి ఆమేడలో. ఎగుడు దిగుడులన్నింటినీ సమానంగా భావించగలిగే స్థితప్రజ్ఞత్వం మానవునికి రావాలి. అపుడే వాని జన్మకు సార్థకత. వానివల్ల సమాజానికి మేలూ చేకూరుతుంది. కష్టాలకు క్రుంగిపోయి, సుఖాలకు పొంగి పోయేవాడు జీవితంలో స్థిరత్వాన్ని ప్రశాంతతను సాధించలేడు. సమాజానికి సహకరించలేడు.

ఇక జీవితం వడ్డించిన విస్తరి. దానిని వినియోగించుకోవడం తెలియాలి. అపుడే అది మనకుపకరిస్తుంది. లేకుంటే అది కుక్కలు చించిన విస్తరే.

ఈ రెండు విషయాలు ఈ చిత్రంలో ప్రతీకాత్మకంగా, సింబాలిక్‌గా చిత్రించబడినవి. ఆ చిత్రీకరణలో ప్రధానపాత్ర ప్రముఖ పాత్ర వహించిన అక్కినేనికి ఆంధ్రదేశం అభినందనలు తెలుపుతుంది.



కళాత్మక హృదయమున్న ప్రతివాని హృదయంలో కలకాలం నిలిచిపోతాయి. మహానటుడు అక్కినేని పోషించిన పాత్రలు.

జీవితాన్నంతా కళకే అంకితం చేసిన అక్కినేనిని-

ఆంధ్రదేశం కృతజ్ఞతలతో ఆశీర్వదిస్తుంది. కళామ తల్లి కరుణార్ద్ర దృష్టితో కనికరిస్తుంది; అఖిల జగతి ఆనందంతో అంజలిస్తుంది నాలాంటి సామాన్య మానవుడు నమస్కరించి,

**ఏడంతస్థుల మేడ ఇదీ**
**వడ్డించిన విస్తరిదీ**

అంతులేని యీ లోకంలో ఆరడుగులే, మనవి తృప్తి అనేదొక్కటే ముక్తి మనిషికీ-అని మననం చేసికొంటూ - నిష్క్రమిస్తాడు.

**'రసమయి'**
**రవీంద్ర భారతి సెమినార్**
**09-07-1998.**

# "పాలమూరు లేబరు"

ప్రపంచంలో ప్రాంతాల పేర్లు, కొందరు వ్యక్తుల పేర్లూ చెప్పగానే, వారికి సంబంధించిన కొన్ని విషయాలు స్ఫురిస్తాయి. లింకన్ అనగానే దేశాధ్యక్షులంటే ఇట్లా వుండాలి అనీ, చిరాపుంజీ అంటేనే అధిక వర్షపాతం వుండే చోటనీ, సహారా అనగానే ఎడారి, నిస్సార ప్రాంతమనీ తెలుస్తుంటుంది. అట్లే ఆయా ప్రాంతాల్లో నివసించేవారిపై భౌగోళిక పరిసరాల ప్రభావం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. వారి వేషబాషలు, ఆహార నియమాలు, అలవాట్లు, జీవన విధానాలు తెలుస్తాయి. సాగరతీర వాసులనంగానే, అక్కడి శ్రామికులు చేపలు పడతారని తెలుస్తుంది. అట్లే - ఆంధ్రప్రదేశ్‌లోని "పాలమూరు జిల్లా" అనగానే, అందరికీ స్ఫురించేది, అమాయక శ్రామిక జనం, రెక్కలు ముక్కలు చేసుకునే కష్టజీవులు, వారే పాలమూరు లేబరు.

పాలు, మూరు (పెరుగు) అమ్ముకొని ఈ ప్రాంతంవారు జీవించడంవల్ల, ఈ ప్రాంతానికి పాలమూరు అనే పేరు స్థిరపడింది. ముస్లిముల పరిపాలన ప్రభావంవల్ల మహబూబ్‌నగర్‌గా పిలువబడింది. ముసలితరంవారు ఇప్పటికీ పాలమూరుగానే పిలుస్తారు.

పాలమూరు లేబరుకు సంబంధించిన కొన్ని వివరాలు తెలిసికోవడం ఈ వ్యాసం ముఖ్యోద్దేశం.

......................

**నైలు నదీ నాగరికతలో**
**సామాన్యుని జీవనమెట్టిది?**
**తాజ్‌మహల్ నిర్మాణానికి**
**రాళ్ళెత్తిన కూలీ లెవ్వరు?**

......................

**ప్రభువెక్కిన పల్లకి కాదోయ్**
**అది మోసిన బోయీ లెవ్వరు? (శ్రీశ్రీ)**

ఏ దేశ సంపదైనా, అక్కడి ధనవంతులపై కార్మిక, శ్రామికుల భుజాలపై ఆధారపడి వుంటుంది. అక్కడి పనివారి పనితనంపై అధారపడి వుంటుంది. కూలీల నైపుణ్యంపై ఆధారపడి వుంటుంది. శ్రామిక శక్తిలేనినాడు దేశ సౌభాగ్యమే లేదు.



భారతదేశంలోని యే రాష్ట్రంలోనైనా, పెద్ద నిర్మాణం జరుగుతుందంటే, అక్కడ తప్పక పాలమూరి లేబరు వుంటారు. వారి చెమటతో తడిస్తేనేగాని ఆ కట్టడం, ప్రాజెక్టు నిలవదు కాబోలు! అది నాగార్జునసాగరమైనా, పోచంపాడు ప్రాజెక్టయినా, రూర్కేలా, విశాఖ ఉక్కు కర్మాగారాలైనా, రామగుండం థర్మల్ పవర్ స్టేషనైనా, తెలుగు గంగ ప్రాజెక్టయినా, ఆసియా క్రీడోత్సవాలకై ఢిల్లీలో నిర్మించిన ఏసియాడ్ వంటి స్టేడియాలైనా, మరింకేవైనా పాలమూరి లేబరు చేతుల మీదుగా పని సాగాల్సిందే; వీరి రక్తం సలసల కాగాల్సిందే; వీరి ఎముకలు అరగాల్సిందే; చేతులు గడ్డపారలై తవ్వాల్సిందే; దోసిళ్ళు పారలై మట్టి యెత్తి పోయాల్సిందే.

శ్రమించే తత్వం ఇంతగా గల పాలమూరు జిల్లా శ్రామికులు రాష్ట్రాంతరంగానే గాక, దేశాంతరంగా వెళ్ళి పనిచేయడానికి యెన్నో కారణాలున్నాయి.

జిల్లాలో అక్షరాస్యుల సంఖ్య తక్కువగా వుండడం, అజ్ఞానం యెక్కువ కావడం మూలకారణం. దానితో తమ శ్రమ శక్తిని క్రమబద్ధీకరణ చేసికోలేకపోతున్నారు ఈ జిల్లావాసులు. అంతేగాక, వ్యావసాయిక వనరులు, నీటి వనరులు మొదలైనవి ఈ జిల్లాలో తక్కువగా వుండడమూ కారణమే అవుతున్నది. పరిశ్రమలు తక్కువగా వుండి పని లభించని స్థితి యేర్పడడమూ ఒక కారణము. తమ శ్రమ శక్తిని దోపిడీ చేయడం వారు గమనించలేని అమాయకత్వం పాలమూరి లేబరు కడగండ్లకు కారణాలౌతున్నవి. చారిత్రక భౌగోళిక కారణాలూ దీనికి, అనగా పాలమూరి లేబరు వలసకు దోహదమౌతున్నాయి.

"హైదరాబాదు రాష్ట్రం - మన కర్తవ్యాలు"- అనే రచనలో బద్దం ఎల్లారెడ్డిగారు - నాటి తెలంగాణా పరిస్థితులను వివరిస్తూ-

"ఈ ప్రాంతంలో జాగీరుదార్లు, మక్తేదార్లు, అగ్రహారీకులు, వివిధ రకాలైన వారు అక్రమ వసూళ్ళు చేస్తుంటారు. వెట్టి చాకిరీ సర్వసాధారణం దేశ్‌ముఖ్‌లు, దొరలు సారవంతమైన వేలాది ఎకరాల భూములను తమ స్వంత ఆస్తి కింద దాఖలు పర్చుకున్నారు. పటేల్, పట్వారీలు కూడా వందలాది ఎకరాల భూములను ఆక్రమించుకున్నారు. పన్నుల తీవ్రనిర్బంధ విధానం, వడ్డీ వ్యాపారస్తుల పీడన వికృతంగా ఉండేవి. నాగులు, వడ్డీలు చెల్లించలేక, కొంత కాలానికి భూమిని వడ్డీ వ్యాపారస్తునికి ఇచ్చివేసి, దేశం వదిలి పెట్టి మరోచోటికి బ్రతుకు తెరువుకోసం పోవడమో, కూలీలుగా బ్రతుకుతుండడమో జరిగేది. క్రమక్రమంగా భూమి దున్నే రైతుల చేతోల్లోంచి వడ్డీ వ్యాపారస్థుల చేతుల్లోకి పోయి, రైతులు వాళ్ళ భూముల్లోనే కౌలుదార్లుగానో, జీతగాళ్ళుగానో మారేవాళ్ళు....." అన్నారు.

ఇది పూర్తిగా తెలంగాణా జిల్లాల్లో వుండిన పరిస్థితి; పాలమూరు (మహబూబ్‌నగర్) తెలంగాణా జిల్లాల్లోనిది. అన్ని రకాలుగా వెనుకబడింది. అక్షరాస్యతలోనూ, ఆర్థిక వనరులలోనూ ఇది చివరిస్థానాన్ని పొందుతుంది. అందుకే పొట్ట చేతబట్టుకుని దొరికిన పనల్లా చేస్తూ, అవసరమైన చోటికల్లా తట్టనెత్తిన వేసుకొనిపోవడం జరుగుతుంది పాలమూరు లేబరు.

1951 గణాంక వివరాల ప్రకారం జిల్లా 1233 గ్రామాలు, 10 తాలూకాలతో, 5,749,80 చదరపు మైళ్ల వైశాల్యం కలిగివుండేది. రాష్ట్రాల, జిల్లాల, తాలూకాల పునర్విభజన తర్వాత జిల్లాలో 1470 నివాస గ్రామాలు, 70 అనివాస గ్రామాలు, 16 పంచాయతీ సమితులుగా, 18,432 చ.కి.మీ. వైశాల్యం కలిగి ఉంది. అదనంగా చేరిన తాలూకాలతో జిల్లాలో మొత్తం 13 తాలూకాలుండగా, అవి 64 మండలాలుగా విభజింపబడినవి. మొత్తం తెలంగాణాలో వైశాల్యంలో పాలమూరు జిల్లా పెద్దది. ఎక్కువ జనాభా గలది. జిల్లా అంతటా ఉష్ణోగ్రత ఎక్కువ. వర్షపాతం సుమారు 775 మిమీ సరాసరి వర్షపుదినాలు 45 మాత్రమే. 10 సంవత్సరాల వర్షపు రోజులు 435 మాత్రమే. కేంద్ర ప్రభుత్వంచేత Dry Farming Zone గా గుర్తింపబడి, శాశ్వత Drought Affected Area గా ప్రకటింపబడింది.

జిల్లా జనాభా 1981 లెక్కల ప్రకారము 24.4 లక్షలు. గ్రామీణ ప్రాంతాల్లో 22 లక్షలుంటే, పట్టణ ప్రాంతాల్లో 2.67 లక్షలుంటున్నారు. పారిశ్రామికంగా పాలమూరు జిల్లాలోని పట్టణాలు అభివృద్ధి చెందలేదు.

కృష్ణా తుంగభద్రలు ఈ జిల్లా నుండి ప్రవహించినప్పటికీ, ఈ నదీ జలాల వల్ల ఈ జిల్లాకు యెలాంటి లాభం లేదు. డిండి ప్రాజెక్టు వల్ల ముంపుకు గురైనవి పాలమూరు జిల్లా గ్రామాలు, సాగుకు నీరు లభించేది నల్లగొండ జిల్లా భూములకు. జిల్లాలో సారవంతమైన ఎర్ర, నల్ల నేలలు 30% కాగా, సారహీనమైన దుబ్బలు, ఇసుక చెల్కలు 70% జిల్లా వైశాల్యంలో సుమారు 16% అడవి ప్రాంతం.

షాబాద్‌రాళ్ళు, సున్నపురాళ్ళు, క్వార్ట్జ్ (పలుగు రాళ్ళు), వజ్రాల గనులు జిల్లాలో వున్నా, ఆ ఖనిజ సంపద ఇంకా వెలికి రాలేదు.

జిల్లాలోని 24 లక్షల జనాభాలో 11,60,432, మంది వివిధ రకాల కూలీలు. 9 లక్షల మంది వ్యవసాయంలో, రెండున్నర లక్షల మంది కుటీర పరిశ్రమలు, చేనేత, బీడీ కర్మాగారాల్లో వున్నారు. ప్రపంచ ప్రసిద్ధి పొందిన నారాయణపేట, గద్వాల చీరలు, ఇతర బట్టల నేత రంగంలో సుమారు 16000 కుటుంబాలు పొట్ట పోసుకుంటున్నవి.



"గాలిలోన తెలిపోయే చీరగట్టిన చిన్నాదానా
చీర వెలుగుల జిలుగు శిల్పం ఎలా వచ్చెనో చెప్పగలవా?....
చిరుగు పాతల బరువూ బతుకుల
నేతగాళ్ళే నేసినారు-
చాకిరొకరిది సౌఖ్య మొకరిది
సాగదింకా - తెలిసికో" -అని

కవి (ఆత్రేయ) చెప్పిన జోస్యం పాలమూరు జిల్లా నేతగాంధ్ర విషయంలో మాత్రం ఫలించలేదు. వారి శ్రమ శ్రమగానే మిగిలిపోతున్నది. ఫలితాలు ఇతరులకు దక్కుతున్నాయి. బొంబాయి మొదలైన పట్టణాలకు వెళ్ళి తమ పనితనాన్ని ప్రదర్శించినా, వారికి లభించే దినసరి వేతనం చాలీచాలనిదిగానే వుంటున్నది.

స్థూలంగా, పాలమూరు జిల్లా శ్రామికులు లేబరుగా వెళ్ళడానికి ఇది భూమిక. పారిశ్రామికంగా వెనుకబాటు, విద్యా విహీనత, జనాభా సమస్య, ఆర్థిక వనరులు సరిపడా లేకపోవడం, మూలకారణాలై ముందుకు నెడుతున్నాయి.

స్వతంత్ర భారతంలోనే కాదు, నైజాం రాజ్యంలో బ్రిటిష్ పాలనా విధానం ప్రవేశపెట్ట బడినపుడు రైల్వేదారులు, రహదారులు, ఫ్యాక్టరీలు మొదలగు వాని నిర్మాణానికి, చౌకగా లభించి, యెక్కువ పనిచేసే అమాయకులగా పాలమూరు లేబరు ప్రసిద్ధికెక్కింది. సికింద్రాబాద్ నుండి బెంగుళూర్‌ను కలిపే మీటర్‌గేజ్ రైల్వేమార్గం పాలమూరు లేబరే నిర్మించింది. రెండవ ప్రపంచ యుద్ధంలో, బొంబాయి, హైదరాబాదు లాంటి పట్టణాలలో మిలిట్రీ బ్యారెక్స్ కట్టడాలు, విమానాశ్రయాలు నిర్మించేందుకు, సైనిక సిబ్బందికి సాయం చేసేందుకు పాలమూరు లేబరు పనికి వచ్చారు. 1949-50 ప్రాంతంలో బళ్ళారి సమీపంలోని తుంగభద్రా డ్యాం పాలమూరి లేబరు నిర్మించింది.

పాలమూరి జిల్లాలోని కొన్ని పెద్ద గ్రామాలను మినహాయిస్తే అన్ని గ్రామాల నుండి లేబరు వెళుతుందనే చెప్పాలి. ప్రతి గ్రామం నుండి తక్కువకు తక్కువ 200, ఎక్కువకు ఎక్కువ 300 వరకు లేబరు వెళుతుంటారు. ఇందులో అసలే భూమి లేనివారి సంఖ్య యెక్కువ. ఐతే రెండు మూడు ఎకరాల భూమి వున్న సన్నకారు రైతులు సైతం లేబర్ పనికి వెళ్ళడం జరుగుతుంది. వర్షాలు కురిసి అదునైన తర్వాత విత్తనాలు వేసి, ఇంటిలో వుండే ముసలి ముడిగిని పొలం వద్ద కాపలావుంచి, మిగతావారు లేబర్ వెంట ప్రయాణ మౌతారు. ఆ లెక్కన గ్రామాల్లో ఎంత మంది సన్నకారు రైతులో ఎంత మంది లేబర్ వెంట వెళతారో ఊహించుకోవచ్చు.

జిల్లా నుండి లేబర్ వెళ్ళేవారి సంఖ్య ఆ సంవత్సరం జిల్లాలోని కరువు పరిస్థితిని బట్టి వుంటుంది. వర్షాలు సకాలంలో కురిసి, అదును సరిగా ఐతే ఈ లేబర్ సంఖ్య తగ్గుతుంది. వర్షాభావం కలిగితే, లేబర్ సంఖ్య పెరుగుతుంది.

ఈ లేబరు వ్యవహారమంతా మూడంచెలుగా జరుగుతుందని చెప్పవచ్చు.

1. పెద్ద కంట్రాక్టరు లేక కన్‌స్ట్రక్షన్ కంపెని.

2. గుత్తేదారు లేక చిన్న కంట్రాక్టరు

3. మేస్త్రీ మరియు లేబర్.

1. భారీ నిర్మాణాలను సాధారణంగా పెద్ద పెద్ద కంపెనీలు చేపడుతుంటాయి. కొన్ని సందర్భాలలో ఆ పనిని బట్టి, కొందరు కంట్రాక్టర్లు, చేపడుతుంటారు. నిర్మాణం కంపనీలు తాము తీసికున్న పనిని ముక్కలుగా అంటే యూనిట్లుగా విభజించి చిన్న కంట్రాక్టర్లకు, నిర్ణీతమైన రేట్లపై ఇస్తుంటాయి. వీరి దగ్గర బాగా పని తెలిసిన వారు, పనికి ఉపకరించే యంత్రాలు మొదలైనవి వుంటాయి. ఈ పనికి అధిక సంఖ్యలో జనం అవసరమౌతుంటారు. కాని పని జరుగుతున్న ప్రాంతంలో అంతమంది జనం దొరకరు. దొరికినా చౌకగా దొరకక పోవచ్చు. కష్టించి పనిచేసి రెక్కలు ముక్కలు చేసుకొనే అమాయకులు దొరకకపోవచ్చు. ఆ పనికి తగిన అనుభవం వున్నవారు లేకపోవచ్చు. కాబట్టి ఈ లక్షణాలన్నీ ఉన్న ఒరియా, పాలమూర్ లేబరు ఇటువంటి ప్రాంతాల్లో మనకు కనబడుతూ వుంటారు.

2. పెద్ద కంట్రాక్టర్ నుండి పనిని తీసుకున్న చిన్న కంట్రాక్టరు మేస్త్రీల నాశ్రయిస్తాడు. జనాన్ని సమకూర్చగల సత్తా, నేర్పూ వున్నవారిని ఆయా గ్రామాల్లో ఎన్నుకుంటారు. ఈ వూరి నుండి ఇంతమందిని తేవాలని నిర్ణయిస్తారు. ఇంత రేటని కూడా నిర్ధారిస్తారు. ఈ మేస్త్రీలను దళారీలనీ, కమీషన్ కంట్రాక్టర్లనీ అనవచ్చు. దళారీలకు వారు సమకూర్చిన లేబర్ సంఖ్యనుబట్టి కమీషన్ దొరుకుతుంది. ఈ దళారీలు ఏ పనీ చేయకుండానే, పైసా పెట్టుబడి లేకుండానే లక్షల రూపాయల నార్జిస్తుంటారు,

3) మేస్త్రీలు కూలీలను సమకూరుస్తుంటారు. ఆడామగా తేడా లేకుండా పని చేయగలిగిన సత్తా వున్నవారిని ఎన్నుకుంటుంటారు. సాధారణంగా కుటుంబంలోని భార్యా భర్తలను లేబర్‌గా వచ్చేందుకు ఒప్పిస్తుంటారు. మేస్త్రీలు సాధారణంగా మధ్యతరగతి కుటుంబాలవారుంటారు. కాస్త లౌకిక వ్యవహారజ్ఞానం కలవాళ్ళు యీ పని చేస్తుంటారు. మేస్త్రీ రవాణా సౌకార్యాన్ని యేర్పరుస్తాడు. ప్రయివేటు సర్వీసు కంట్రాక్టుకు తీసుకుంటాడు.

ఈ ఖర్చు కంపెనీయే భరిస్తుంది. మేస్త్రీ తాను ఎన్నుకున్న లేబరునంతా ఒకచోట చేరుస్తాడు. అట్లా చేర్చడాన్ని "గుంపు కట్టడం" అంటారు. గుంపు కట్టడం, లేబర్, మేస్త్రీ,



దేశం, సీజన్ మొదలైన పదాలు పాలమూరు లేబరుకు సంబంధించిన కొన్ని పారిభాషిక పదాలు.

లేబరును ఎన్నుకోవడంలో ఒక ప్రత్యేకత వుంటుంది. పని చేయగలిగిన వారిని మాత్రమే ఎన్నుకుంటారు. సాధారణంగా మధ్యవయస్కులు, 12 సం॥ దాటిన పిల్లలను మాత్రమే ఏరుకుంటారు. తల్లిని విడిచి ఉండలేని ఒకటి రెండు సంవత్సరాల పిల్లలను మాత్రమే వారితో రానిస్తారు. ఆడా మగా వస్తున్నపుడు భార్యాభర్తలకు ప్రాధాన్యత ఇస్తారు.

లేబరును ఎన్నుకుంటున్నపుడు, అందులో ఎక్కువగా అప్పులు చేసి తీర్చలేనివారు, వడ్డీలు చెల్లించలేనివారు, పొలమూ, ఆస్తులు తాకట్టు పెట్టి విడిపించలేని వారు మొదలైనవారే యెక్కువగా వుంటారు. వారినే మేస్త్రీ 'అడ్వాన్సు' అనే ఎరతో ఆకర్షిస్తుంటాడు. పనికి వస్తాము అని ఒప్పందం కుదుర్చుకున్న వారికి మేస్త్రీ అడ్వాన్సుగా డబ్బు ఇస్తుంటాడు. భార్యాభర్తలకైతే సుమారు 3000/- ఒక్కరికైతే 1500 రూ॥లు ఇస్తుంటాడు. ఇది సుమారు 5 నెలల నిర్విరామ శ్రమకు ప్రతిఫలమని గమనించాలి.

మేస్త్రీ వద్ద అడ్వాన్సుగా తీసుకున్న డబ్బు తమ గ్రామంలో తాము చేసిన పాత బాకీలకు చెల్లించి లేబరెంట పోతారు. వీరు అడ్వాన్సు తీసుకోవడానికి గ్రామంలోని సర్పంచు గానీ, పెద్ద వ్యాపారి గానీ సాక్షిగా వ్యవహరిస్తారు. లేబరు పనికని పోయిన చోట పరిస్థితులు అనుకూలించక ఒకోసారి లేబర్ జనం పారిపోయి రావడం జరుగుతుంది. అట్లాంటపుడు ఈ సాక్షులే, తిరిగి వారి డబ్బు వారికి యిప్పించడంలో సాయపడుతుంటారు.

లేబర్ బయలుదేరుతున్నారంటే, వారికి కావలసిన పారలు, గడ్డపారలు, తట్టలు గంపలు, మొదట కొంటారు. ఇవి కొనడానికి మేస్త్రీకి చిన్న కంట్రాక్టరు డబ్బు యిస్తాడు; చిన్న కాంట్రాక్టరుకు పెద్ద కాంట్రాక్టరిస్తాడు. ఎపుడూ బస్సెక్కని సంతోషం (ఇపుడెక్కుతున్నా మని) వారిని తొందరపెడుతుంటే, అప్పగింతల లాంటి వౌతుంటే, అరుపుల మధ్య సర్వీసు బయలుదేరుతుంది. ఆ సందర్భాన్ని గురించి పాడకునే పాట-

**"జర భద్రం కొడుకో**
**నా కొడుకో భౌంరన్న**
**జరా భద్రం కొడుకో!**
**ఎక్కేతాన - దిగేతాన**
**తొవ్వేతాన - తొక్కేతాన**
**ఎత్తేతాన - దించేతాన**
**భద్రం కొడుకో!"**

అని పాటించవలసిన జాగ్రతలను చెబుతుంటారు. ఈ లేబర్ సాధారణంగా అక్టోబర్ నుండి

మే నెల చివరి వరకో, నవంబర్ నుండి జూన్ చివరివరకో మొత్తంమీద అక్కడి పని తీవ్రతనుబట్టి, కంట్రాక్టర్‌తో కుదుర్చుకున్న ఒప్పందాన్ని బట్టి సుమారు 5 నెలలకు తక్కువ కాకుండా పని చేయాల్సివుంటుంది. వర్షాకాలం తొలి జల్లులు పడే వరకు తమతమ వూళ్ళకు తిరిగి చేరాలనుకుంటారు లేబర్.

ఉత్సాహంగా ఊళ్ళనుండి బయలుదేరిన గుంపు అలిసీ సొలసీ పనిచేయాల్సిన ప్రాంతానికి చేరుకుంటుంది. అక్కడ వారు తమ నివాసాలకు అవసరమైన గుడిసెలలాంటివి యేర్పాటు చేసుకోవాలి. దానికి కావలసిన కొంత సామగ్రి కంట్రాక్టర్లు సరఫరా చేస్తారు. మిగతా ఆకులు మండలు మొదలైనవి పక్కనవుండే అడవిలో నుండి వారే కొట్టి తెచ్చుకోవలసివుంటుంది. ఇద్దరిద్దరికి ఒక గుడిసె చొప్పున గుడిసెలు కట్టబడతాయి. వారి పిల్లలు అందులోనే వుంటారు. ఈ గుడిసెలు "H" ఆకారంలో కట్టబడతాయి. ఈ రెండు వరుసలకు మధ్య మేస్త్రీ గుడిసె వుంటుంది. అది కాస్త సౌకర్యంగా వుంటుంది ప్రతి 50 మంది కూలీలకు ఒక వంటమనిషి చొప్పున యేర్పాటు చేస్తారు. వీరికి నీళ్ళు తెచ్చేందుకు సైతం ఒక మనిషిని యేర్పాటు చేస్తారు. గ్రామాల నుండి లేబరును ఎంచుకునేప్పుడే వంట వచ్చినవారిని, రొట్టెలు కొట్టగలిగినవారిని చూసి, అడిగి యేరుకుంటారు. ఈ ఏర్పాట్ల ఖర్చు మేస్త్రీ, తద్వారా కంట్రాక్టరే భరిస్తారు.

గుడిసెలు ఏర్పాటైన మరుసటిరోజు నుండి పని ప్రారంభం. ఉదయం 6 గంటల నుండి సాయంకాలం 6 గంటల వరకు పనేపని. చిన్నచిన్న గుంపులకు చిన్న చిన్న సూపర్‌వైజర్స్, పర్యవేక్షకులుంటారు. కథలతో, పొడుపుకథలతో, బూతుపాటలతో - మాటలతో శ్రమ తెలియకుండా పనిచేస్తూనే వుంటారు.

లేబరుకు పోతే యెదురయ్యే సాధక బాధకాలను పాడుకుంటారు-

**"పోదం పిల్లో**
**పోచంపాడు లేబరెంట**
**పోదం పిల్లో !**
**వొద్దురు మావో**
**పోచంపాడు పాడుగాను**
**వొద్దుర మావో!**
**పచ్చపచ్చ నోట్లు జూస్తె**
**పాన మొస్తదీ**
**పోచంపాడు కాల్వలోన**
**దుక్కమొస్తదీ**
**వొద్దుర మావో!"**



అని, పాడుకుంటూ పనిచేస్తుంటారు. సుమారు 10 గంటల ప్రాంతంలో అరగంట విశ్రాంతి. బీడీ, చుట్టలు కాల్చేవారు ఆ పరిమిత సమయంలో కాల్చుకోవచ్చు.

పని జరిగేచోటనే భోజనం యేర్పాటు చేయబడుతుంది. ఉదయం రొట్టెలు, కూర వడ్డిస్తారు. మధ్యాహ్నం అన్నం, అంతంత మాత్రమే కూర, పిండి పులుసు, లేదా ఉల్లిగడ్డల పులుసు వడ్డిస్తారు. వారి వారి పిల్లలకు భోజనం ఉచితంగానే పెడతారు. ఇది వారి అదృష్టంగా భావించాలి. మేస్త్రీ సహృదయతపై లేబర్ ఆహారం యొక్క మంచి చెడ్డలు ఆధారపడి వుంటాయి. సాయంకాలం 7-30 గంటల వరకే భోజనం ముగించుకొని గుడి సెల్లో పడుకోవాల్సిందే. ఈ గుడిసెల్లో దీపాలు మొదలైనవేవీ వుండవు.

ప్రతి 15 రోజలకు ఈ లేబరుకు సెలవు దినం. దీనికొరకు వీరు యెదురు చూస్తుంటారు. ఆరోజు కంట్రాక్టరు మేస్త్రీకి 15 రోజులకు కావలసిన డబ్బు యిచ్చి పోతుంటాడు. లేబర్ ఆరోజు స్నానాలు చేయవచ్చు. దానితోపాటు పక్కనేవున్న అడవిలోకి వెళ్ళి వంటకు కావలసిన కట్టెలమోపు విధిగా తీసుకురావాలి. ఆ రోజు వారికి భోజనంలో ఒక పూట స్పెషల్. అంటే మాంసం వడ్డిస్తారు. మాంసం తిననివారు ఆ లేబర్‌లో వుండరు- అనుకోవాల్సి వస్తుంది. ఉంటే ఆ రోజూ పిండి పులుసే వారికి గతి. ఏవేని కారణాల వల్ల లేబర్ ఒకటి కంటె యెక్కువ రోజులు పనికి హాజరు కాలేకపోతే ఆ రోజులు లెక్కరాసి, డబ్బు కట్ చేస్తారు. వాటిని 'కుంటిదినాలు' అంటారు.

కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం పని ముగిసిన తర్వాత లేబరుకు రావలసింది లెక్క చేసి, రావలిస్తే ఇచ్చి, (అడ్వాన్సు మినహాయించుకొని) తిరిగి యింటికి పంపిస్తుంటారు. ఇందులో సంపాదన జరిగేదంతా పాలమూరు లేబరు శ్రామిక శక్తి ననుసరించి. కాని పెద్ద కాంట్రాక్టుకు, చిన్న కాంట్రాక్టరు, మేస్త్రీ, దళారీల వాటాలు పోగా, మిగిలింది నామ మాత్రంగా మాత్రమే కూలీలకు చేరుతుంది. "చాకిరొకరిది, సౌఖ్యమొకరిది", అనే వాక్యం ఇక్కడ అక్షరాలా సత్యమనిపిస్తోంది.

ప్రాజెక్టు ప్రాంతాల్లో పనిచేస్తున్న అడవాళ్ళపై అత్యాచారాలూ జరుగుతుంటాయి. నయానా భయానా వారిని లొంగదీసుకుంటారు మేస్త్రీలు మొదలైనవారు. మేస్త్రీ భావాన్ని గమనించిన ఒక యువతి ఉపాయంగా తప్పించుకున్న విషయం, పాలమూరి లేబరు పాటలో కనబడుతుంది.

**" అలాంటిలాంటాడదాన్ని**
**కాను మేస్తిరీ!**
**అద్దరూపాయి డబ్బులాకు**

**రాను మేస్త్రీ!**
**పనికి రాను మేస్త్రీ!"**

అని తప్పుకుంటుంది మేస్త్రీ నుండి, పాలమూరు లేబరు యువతి.

ప్రాజెక్టు సైటునుండి ఊర్లకు తిరిగివచ్చిన లేబరు తమ కష్టాలను మననం చేసుకోవడం వారి పాటల్లో వినబడుతూ వుంది-

**"ఉప్పులేని గంజి తాగీతిమయ్యా**
**చొప్పకట్టేలోలె సోలీతిమయ్యా!"**

అని లేబరు పాడుకుంటుంటారు.

విధిలేక, వేరే ఆదాయ మార్గాలు లేక పాలమూరు లేబరు కఠినమైన యీ పనులకు ఒప్పుకుంటారే తప్ప, కూలి గిట్టుబాటు అయికాదు. రోజుకూ సుమారు 8 రూపాయలే కూలీ. చేయల్సింది 12 గంటల విరామంలేని పని. అయినా గత్యంతరంలేక, విధివంచితులై లేబరు వెంటపోతున్నారు. 12 గంటలు పని చేయగలిగితే, ప్రభుత్వం రేట్ల ప్రకారమైతే కొన్ని రెట్ల అధిక కూలీ లంభించాలి వారికి. కాని వారికా సౌకర్యం లేదు.

బాలకార్మికచట్టాలెన్నోవున్నా, పాలమూరు లేబరు గుంపుల్లో లేతలేత అరచేతులు సైతం పని చేస్తుంటాయి. అవసరానికి చట్టం అతీతం కదా! పొట్ట నింపుకోవాలంటే, అవసరాలు తీరాలంటే, అప్పులు కొంతవరకైనా పూడాలంటే, పసివారు సైతం గుంపులో వొంతుపట్టవలసిందే; నెత్తికి తట్ట యెత్తవలసిందే.

12 సంవత్సరాలు దాటిన బాల బాలికలకు పెద్ద వారితో సమానంగా కూలీ యివ్వబడుతుంది. పెద్దవారికి మాత్రం యెక్కవగా యిస్తున్నారని కాదు. స్త్రీలకు, పురుషులకు బాల బాలికలకు అందరకూ సమానమైన కూలీయే లభిస్తుంది. ప్రపంచంలో మరెక్కడా లేని వింతైన, వికృతమైన ఈ కూలీ విధానం కేవలం పాలమూరు లేబరుకు మాత్రం వుంది.

పాలమూరు లేబరు వలన వెళ్ళడం ఈ మధ్య కొంత తగ్గింది. దీనికి కారణాలు ఎన్నో వున్నాయి. జిల్లాలోని జూరాల ప్రాంతాల్లో ప్రాజెక్టు పనులు కొంత జరగడం వల్ల ఆ పరిసర ప్రాంతాల వారికి అక్కడేపనులు దొరకుతున్నాయి కొందరికైనా. కల్వకుర్తి ప్రాంతంలో సూర్యలక్ష్మి కాటన్‌మిల్స్ సంస్థవారు సుమారు నాలుగు మిల్స్ స్థాపించారు. కల్వకుర్తి వద్ద ఒకటి; ఆమనగల్లు సమీపంలో ఒకటి; మిడ్జిల్ వద్ద ఒకటి, కడ్తాల సమీపంలో మరొకటి కాటన్ మిల్స్ స్థాపించి, పొరుగుగ్రామాల నుండి లేబర్‌ను తీసికొని నడుపుతున్నారు. అందువల్ల ఈ ప్రాంతాల నుండి జనం 1985 తర్వాత అంతగా లేబర్ వైపు మొగ్గు చూపడం లేదు. అంతేగాక, జిల్లాలో భూగర్భ జలాలను వెలికితీసే ప్రణాళికలో సఫలీకృతులైన కొందరైనా



సన్నకారు రైతులు కొంతకు కొంత సేద్యం చేసుకుంటున్నారు. రఘుపతి పేట, సుద్దకల్లు, ప్రసిద్ధ పట్టణములు, గ్రామములు, పుణ్యక్షేత్రములు. కుర్మిద్ద, మార్చాల, సింగంపల్లి రాచూరు మొదలైన గ్రామాల రైతులకు నీటి వసతి మొదటికన్నా మెరుగైంది అది కూడా పాలమూరు లేబరు వలస తగ్గడానికి కొంత కారణమయిందని చెప్పవచు.

పాలమూరు లేబరు ప్రపంచ ప్రఖ్యాతి చెందింది. ఇరాన్, ఇరాక్ వంటి దేశాల్లో Skilled labour, unskilled labour గా పాలమూరు లేబరు వ్యాపించివున్నారు.

పాలమూరు లేబరు సమస్య పలువురు పరిశోధకుల, కవుల దృష్టిని ఆకర్షించింది. ఈ సమస్యపై ఉస్మానియా విశ్వవిద్యాలయం అర్థశాస్త్ర విభాగంలో రవీందర్‌గౌడ్ గారు యం.ఫిల్. చేశారు. ఇదే సమస్యపై కేంద్రీయ విశ్వవిద్యాలయంలో రమణగారు యం.ఫిల్. చేశారు. ఐతే, వీరిరువురూ ఈ సమస్యను సామాజిక ఆర్థిక దృక్పథంతో పరిశీలించారు. సాహిత్య నేపథ్యంతోనూ పాలమూరు లేబరు సమస్యపై పరిశోధన చేయవలసిన అవసరం వుంది.

1977 నవంబర్ డిశంబర్ నెలలో బందరు ఉప్పెన పెనుభూతమై ఎంతోమందిని బలిగొన్నది. ఆ ఉప్పెనలో కేవలం అక్కడివారేకాదు. చేపలు పట్టడానికని దినసరి వేతనాల మీద వెళ్ళిన జాలరు లెందరో-జాడ లేకుండా పోయారు. పాలమూరు జిల్లాలోని వారి కుటుంబాలు అనాథలైనవి. వారి వేదన విన్న ఇక్కడి కవులెందరో, అదే కవితావస్తువుగా కవితా గానం చేశారు. శోకమే శ్లోకమైనట్లుగా-

డాక్టర్ ముకురాల రామారెడ్డిగారు-

**ఎన్నడొస్తవు జాలరీ**
**పాలమూరు లేబరీ!**

అంటూ హృదయ విదారకంగా గానం చేశారు. 'ఉప్పెన' సంపుటంలో ఆ కవిత చోటు చేసుకున్నది.

ఇదీ పాలమూరు లేబరు సమాచారం. ప్రభుత్వమూ, స్వచ్ఛంద సంస్థలూ పూనుకొని, పాలమూరు లేబరు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించాలి. అపుడు పాలమూరు లేబరు కడగండ్లు సమసిపోతాయని ఆశిద్దాం!

**(బి.యన్. శాస్త్రిగారి**
**పాలమూరు**
**విజ్ఞాన సర్వస్వం నుండి)**

# ౬. దేవులపల్లి కృష్ణశాస్త్రి చలన చిత్ర గీతాలు

**దేవులపల్లి కవితల్లే**
**బాపూ గీసిన బొమ్మల్లే**
**ఎవరైనా మీకెదురైతే**
**గోపాల్రావుగారి అమ్మాయి**
**లోకం తెలియని పాపాయి**

అనేది ఒక సినిమా పాటలోని కొంత భాగం. తెలుగు సాహిత్యంలో దేవులపల్లి కవితకున్న రూఢిని తెలుపుతుంది. సౌకుమార్యం కోమలత, అమాయకత, స్నిగ్ధత, ప్రకృతి రామణీయకత దేవులపల్లి కవితలో యెంతగా వ్యాపించి వుంటుందో తెలుపుతుంది యీ వాక్యం. తెలుగు సాహిత్యంలో యింతటి సాహిత్య లక్షణాలను సంతరించుకున్నది దేవులపల్లి కవిత.

**కృష్ణశాస్త్రి కవితలా, కృష్ణవేణి పొంగులా**
**పాలలా తేనెలా,......**

అని మాధుర్యాన్ని గురించి చెప్పాల్సి వచ్చినపుడు ప్రతీకలుగా వాడడం తెలుగు సాహిత్యనికి పరిపాటి అయింది. తేనె, పాలు, కృష్ణవేణి పొంగు, కృష్ణశాస్త్రి కవిత, సమానార్థకాలు. తేనెల్లో, పాలలో, కృష్ణవేణీ పొంగులోని అంతర్గత లక్షణాలన్నీ కృష్ణశాస్త్రి కవితలో నిబిడీకృతమైనాయి. అందుకే ఆయన కవితకు అంతటి జనాదరణ, ఆరాధన. కవితల ద్వారా తెలుగు సాహిత్యానికి దేవులపల్లి నూతనాధ్యాయాన్ని రచించి సమకూర్చారు. పొందికైన పదాల ద్వారా తెలుగు సాహిత్యానికి దేవులపల్లి నూతనాధ్యాయాన్ని రచించి సమకూర్చారు. పొందికైన పదాలద్వారా భావాలను వ్యక్తీకరించి కవితలో నవరసాలను, చిప్పిల్ల జేయడం దేవులపల్లి ప్రత్యేకత.

దేవలపల్లి తమ కవితా ప్రజ్ఞవ్యక్తీకరణ ద్వారా పండిత పామర జనులందరినీ ముగ్ధుల గావించారు. సాహితీ గగనంలో కొత్త పుంతల నెలకొల్పినారు. భావకవిత్వం అనంగానే, స్ఫురించేపేరు కృష్ణ శాస్త్రిదే. భావకవితా రచనలో మరింకెవ్వరూ అందుకోలేనంత ఎత్తుకు



ఎదిగినారు కృష్ణశాస్త్రి. కవిత్వం విలువలను పోషిస్తూ మానవతా మాహాత్మ్యానికి మహోన్నతోదాహరణలనదగిన కవితలు రాశారు. ఆ బాలగోపాలం ఆయన కవితకు తలలూపే వారే. పెద్దలకు దేశభక్తి యెంత అవసరమో చిన్నపిల్లలకు ఆ దశలో మాతృపితృ భక్తి అంతే అవసరం.

**మా అమ్మంటే మాకిష్టం**
**మా నాన్నంటే మహయిష్టం....**

మా యిల్లంటే మాకిష్టం- మావూరంటే మహయిష్టం-మొదలైన గేయాలు చిరంజీవులకు తల్లిదండ్రులపై ప్రేమానురాగాలను పెంపొందిస్తాయి. ఇటువంటి గేయాలు పెక్కు దేవులపల్లి కలంనుండి జాలువారినవే.

**సౌరభములేల చిమ్ము పుష్పవ్రజంబు**
**చంద్రికలనేల వెదజల్లు చందమామ**
**ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు...**

అట్లే నా కవితా హృదయం కూడా గానం చేస్తుందని చెప్పినాడు దేవులపల్లి....
**'పరోపకారాయ ఫలంతి వృక్షాః**
**పరోపకారాయ దుహంతిగావః**
**పరోపకారాయ వహన్తి నద్యః**
**పరోపకారార్థమిదం శరీరమ్' అన్నట్లు**

సాహిత్యసృష్టి సైతం సామాజికహితం కొఱకే, నని చెప్పకచెప్పినట్లయింది, దానికి అనుగుణంగా సాగిందే కృష్ణశాస్త్రి రచనా వ్యాసంగం.

సినిమా ఒక ప్రసార ప్రచార కళ. ఈనాడది ప్రత్యేకంగా వ్యాపారకళగా మారింది. వ్యాపారకళ ధనార్జనకే. కేవలం ధనార్జనకే ప్రాధాన్యత నిచ్చినపుడు ఆ రంగం వెర్రి వేషాలు వేయడం సహజమే. అందుకే సినిమా పాట వ్యాపార వస్తువు, అందులో సాహిత్యం నేతిబీరకాయలో నెయ్యిలాంటిది-అనే విమర్శలు సర్వత్రా వ్యాపించి వున్నాయి.

కాని -1952లో, జనవాణిలో మల్లీశ్వరి పాటలను సమీక్షిస్తూ తాపీ ధర్మారావుగారు ఈ పాటలతో సినిమా సాహిత్యానికి కావ్యగౌరవం వచ్చింది అన్నారు. మల్లీశ్వరిలోని పాటలన్నీ కృష్ణశాస్త్రిగారే రాసినారని ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదేమో!

విధానాలకు విలువలకు విలువనిచ్చేవారు. ప్రతి అడగూ ఆచితూచి వేస్తారు. అట్లే దేవులపల్లి రచనలన్నింటిలోనూ, విలువలకు పెద్దపీట వేశారు.

అది వచనమైనా, గేయమైనా, పద్యమైనా, నాటకమైనా, గేయరూపకమైనా, బాలగేయమైనా మరింకో సాహిత్య ప్రక్రియైనా, సాహిత్య విలువలను పోషిస్తూ, ఔచిత్యాన్ని

పాటిస్ఫూరచించినవే. అందువల్ల కృష్ణశాస్త్రి పద్యానికి సినిమాపాటకూ సాహిత్యవిలువల విషయంలో తేడావుండదు.

**హాఫీజ్ అన్న కవితలోని**

**" ఇదిగారడీ పాత్ర, ఇది సికిందరు ముకుర**

**మిందు ప్రతిబింబితమ్మీ విశ్వవలయమ్ము**

**ఈ మంత్రి తాక్షులకు ఇది విచిత్రమయమ్ము**

**ఇందు గ్రోలగ దొరకు విశ్వవిజ్ఞానము".**

**అనే పద్యం.**

**మేడంటేమేడకాదు**

**గూడంటేగూడూ కాదు**

**పదిలంగా అల్లుకున్నా పొదరిల్లు మాదీ.....**

అన్న గేయం, వాని వాని సమయ సందర్భాలలో తగిన విలువలను పోషించినవే.

సంగీత కళాభిరుచిని ఒక్కొక్కమెట్టే యెక్కించేందుకు సినిమాలు చక్కని సాధనాలని భావించే దేవులపల్లి చిత్ర కళాతపస్వి బి. యన్. రెడ్డిగారి ప్రోత్సాహంతో చలనచిత్ర పరిశ్రమలో గేయ రచయితగా అడుగు పెట్టినాడు 'మల్లీశ్వరి' చిత్రానికి మాటలు పాటలు సమకూర్చారు. అప్పటినుండి సుమారు నలభై సంవత్సరాలు సినిమా గేయరచయితగా కొనసాగినారు. అయితే ఈయన గేయాలను 'రాశి'లోకాకుడా 'రమ్యత' అనే కొలబద్దతో మూల్యాంకనం చేయాల్సివుంటుంది. కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవ సంఘంవారు శాస్త్రిగారి 43 చిత్రాలలోని 15 పాటలను కూర్చి 'మేఘమాల' అన్న సంపుటంగా ప్రకటించారు.

సన్మాన సంఘంవారు ఆయన సినీగేయసంపుటికి మేఘమాల అని నామకరణం చేయడం సముచితంగా వుంది. శాస్త్రిగారి తొలి చిత్రం మల్లీశ్వరి. అందులో శ్రోతలను బాగా ఆకట్టుకున్న పాట "ఆకాశవీధిలో హాయిగా ఎగిరేవు" అనేది. మేఘమాలను సంబోధిస్తూ నాయికానాయకులు పాడుకుంటారీ పాట. ఆ పాటలో మేఘమాల, అందాల మేఘమాలగా, చందాల మేఘమాలగా, నీలాల మేఘమాలగా, రాగాల మేఘమాలగా, శ్రోతలకు సాక్షాత్కరిస్తుంది. మేఘమాలకు ఆపాదించిన ఈ లక్షణాలన్నీ కృష్ణశాస్త్రి గేయాలలో ప్రతిఫలిస్తాయి. అత్యున్నత విహాయసవీధుల్లో విహరించే కవిభావుకతకు ఇవి సంకేతాలు. శాస్త్రిగారి కవిత్వంలాగే ఇవి సైతం నిర్భరము, మనోజ్ఞగంభీర స్వర సంయుక్తము.



కృష్ణశాస్త్రిగారి చలన చిత్రగీతాలు విషయ వస్తు దృష్టితో చూసినపుడు-అవి

ప్రకృతి సంబంధి,

ప్రణయ సంబంధి,

హాస్యసంబంధి,

పల్లీయ నిసర్గ సౌందర్యసంబంధి,

భక్తి సంబంధి

సామాజికస్పృహ సంబంధి

సంఘ సంస్కరణ సంబంధి

జాతీయాభిమానం, దేశభక్తి సంబంధి

మొదలైనవిగా కనపడతాయి. వస్తువేదైనా, ఆయన ప్రకృతి కవి కావడంవల్ల ప్రకృతి స్పర్శతప్పకుండా వుంటుంది.

ప్రకృతి నుండి ప్రేరణను పొంది స్పందిస్తాడు భావకవి. పరిసర ప్రకృతిలోని వస్తువులే ప్రతీకలు, ఉపమానాలు, వర్ణ్యవస్తువులౌతాయి. ఒకోసారి కవిస్వయంగా ప్రకృతిలో లీనమై తరుగుల్మాదులుగా మారిపోవాలని కోరుకుంటాడు. ఆకోరికకు కారణాలు రకరకాలు. అట్లా వచ్చిందే ఆకులో, ఆకునై, పూవులో పూవునై .....

కవి వ్యక్తీకరించిన యీ భావం కొందరు సమకాలపువారికి నచ్చనపుడు, వారు గేలిచేసినపుడు, కవిలో ఆవేశం పెరుగుతుంది, పట్టుదల పళ్ళు బిగిస్తుంది. తాను సరైన మార్గంలో నున్నానని భావించేవారి కెవరికైనా అంతే - కాబట్టి

**ఆకులో ఆకును, పూవులో పూవునే-కాదు**

**నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు,**

**నాయిచ్ఛయేగాక నాకేటి వెరపు-**

**పక్షినయ్యెద చిన్ని ఋక్షమయ్యెదను**

**మధుపమయ్యెద చందమామ నయ్యెదను**

**నవ్విపోదురుగాక!...**

అంటాడు. ప్రకృతిలో తల్లీనత పొందాలనే గాఢవాంఛ వ్యక్తమవుతుందిక్కడ.

ఈ గేయం సినిమా కొఱకు రాసింది కాదు. సినిమా దానిని తర్వాత వాడుకున్నద్ది. కృష్ణపక్షములోని ఖండికయిది. తర్వాత 'మేఘసందేశం'లో ఈ గేయంతో పాటు మరో

మూడు వీరి భావగేయాలను దాసరి నారాయణరావుగారు వాడుకున్నారు. ఈ మేఘ సందేశం సినిమాను దేవులపల్లి కృష్ణశాస్త్రికి అంకితం చేయడం దాసరి నారాయణరావుగారి మంచిమనసును తెలుపుతుంది. తెలుగు సినిమా కవులకు మొదటిసారి దక్కిన గొప్పగౌరవం యిది.

"ఈ యడవి దాగిపోనా! ఎటులైనా ఇచటనే ఆగిపోనా" అని కృష్ణశాస్త్రిగానంచేసే తీరుకు సుశీల' 'ఆఁ! హాఁ!' అని మాత్రం చేర్చారు. అంటే భాషతో పాటుగా రాగాన్ని సైతం కృష్ణశాస్త్రి నుండి యథాతథంగా గ్రహించి సినిమాలో వాడుకున్నారంటే, ఆ లలిత గేయం లావణ్యమెంతో తెలుస్తుంది.

**ఒరిగింది చంద్రవంక**
**ఒయ్యారి తారవంక**
**విరజాజి తీవెసుంత**
**జరిగింది మావి చెంత...** (ఏకవీర)

అనే గేయం విన్న సహృదయుని మనఃఫలకంమీద ఆకాశంలోని చంద్రతారకలు, ఉద్యానంలోని విరజాజిమావి, తళుక్కుమంటాయి నాయికానాయకుల సాన్నిహిత్యాన్ని ప్రతిబింబిస్తాయి. ప్రకృతీ ప్రణయ భావం ధ్వనిస్తాయి.

**నేనైతే ఆకు కొమ్మా**
**తానైతే వెన్నెలవెల్లా**
**పదిలంగా నేసిన పూసిన పొదరిల్లూ మాది**
**అనేగేయం,** (సుఖదుఃఖాలు)
**నల్లని మబ్బులు గుంపులు గుంపులు**
**తెల్లని కొంగలు బారులు బారులు...**
**అనేపాట,**
**ఊగే జనపా చేలల్లో**
**తేగే సెనగాపూలల్లో**
**పైరాగాలికి పళ్ళికలెత్తీ పడుచులు నిలిచేరో....**

మొదలైనవి ప్రకృతిరామణీయకతను కళ్ళకు కట్టి చూపించే పదచిత్రాలు. ప్రణయ భావంతో నిండిన మనసులకు ఉదాత్తమైన ప్రణయమూస్ఫురించక పోదు ఈగేయంలో.

**మల్లీశ్వరిలోనే**
**'ఓ బావా**
**నాబావా!**



**కోతీబావకు పెళ్ళంట....! అనేగేయం సరసహాస్యాన్ని సంతరించుకుంటే అదేచిత్రంలో**
**"రావి చెట్టుమీద రాగాలు తీసేపిల్లా**
**కొమ్మిరిగి రెమ్మిరిగి రాలినా జారినా!**
**నీ పళ్ళురాలేను...."**

అని మరదలు కొంటెగా సమాధానం యిస్తుంది. ఈ కొంటెసమాధానంలో బావకు మాధుర్యానుభూతే కలుగుతుంది తప్ప వేరుకాదు.

ఎంతవారుగాని -వేదాంతులైనగాని-జానపద ప్రభావం నుండి జారుకోలేరనేది వాస్తవం. కృష్ణశాస్త్రి విషయంలోనూ యీ విషయం సహజమే అవుతుంది.

**గోరింట పూచింది కొమ్మలేకుండా**
**మురిపాల అరచేత, మొగ్గతొడిగింది**
........
**మందారంలా పూస్తే మంచి మొగుడొస్తాడు**
**గన్నేరులా పూస్తే కలవాడొస్తాడు**
**సిందూరంలా పూస్తే చిట్టి చేయంతా**
**అందాల చందమామ అతనే దిగివస్తాడు .....** (గోరింటాకు)

అనే పాటలో జానపదులకు సంబంధించిన కొన్ని విశ్వాసాలున్నాయి.

యుక్తవయస్కలైన అమ్మాయిల చేతులకుగోరింటాకు పెడతారు. కొంతసేపుంచి కడిగివేస్తే చేతులకు రంగు వస్తుంది. ఆరంగు వచ్చేతీరును బట్టి ఆ అమ్మాయికి యెట్లాంటి భర్త లభిస్తాడో చెప్పవచ్చునట! ఇది ఆంధ్రుల జానపదవిశ్వాసం. అదే విషయం గేయంలో రమ్యంగా వివరించబడింది. అట్లే

**గట్టుకాడ యెవరో**
**మరి**
**చెట్టునీడ యెవరో.....**
**అనేగేయంలోను -**
**లేత సింత సిగురల్లే**
**కోతకొచ్చిన వొయసూ**
**పూత మావి కొమ్మల్లే**
**పూతకొచ్చిన పడుసూ....**

మొదలైన పాటల్లో గ్రామీణులకు చిరపరిచితమైన వస్తు వర్ణనలతో తీపి పులుపుల కలగలుపులతో పాకంలో ముంచి పడవేస్తాడు దేవులపల్లి.

కృష్ణశాస్త్రిగారి భక్తి గీతాలలో రామునికీ కృష్ణునికీ చెందినవే యెక్కువ. ప్రత్యేకించి రామ కథకు సంబంధించి శబరి, గుహుల భక్తి చిత్రణ మధురాతి మధురమయింది వీరిరువురిదీ అమాయక భక్తే.

రామునికై శబరి పళ్ళు సమకూరుస్తుంది. తీరా అవి తియ్యనివో, పుల్లనివో

తెలియదు. కేవలం తియ్యవేయివ్వాలి రామునికి, అది ఆమెకోరిక. అందుకని ప్రతిపండూ కొరికి రుచిచూసి, తియ్యగా అనిపిస్తే దాన్ని బుట్టలో వుంచి, పుల్లగా వున్న దానిని పారవేయడం జరుగుతుంది. శబరి చేసిన యీ పనిలో యెంగిలి పండ్లు యిచ్చిన దోషం లోకం దృష్టిలో; కాని ఆమె కది దోషమని తోచనేలేదు. రామునిపై వుండే మధురభక్తి, అమాయకభక్తి వల్ల, ఇక రామునికైతే ఆధ్యాసేలేదు. అన్ని పళ్లూ ఆరగించినాడు. శబరిని ఆదరించినాడు.

గుహుని అమాయకభక్తి మరీ ముగ్ధ మోహనంగా వుంటుంది; నదిని దాటడానికి రామలక్ష్మణులు వస్తారు. అక్కడ నదిని దాటించేవాడు గుహుడు.

**"అయ్యానేవత్తున్నా**
**బాబూనే వత్తున్నా**
**ఆగుబాబు ఆగు**
**నీకాలు సోకిరాయి ఆడది అయినాదంట**
**నీకాలుసోకినా నావ యేమౌతాదోతంట**
**దయవుంచి ఒక్కసారి కాలు గడుగనీయమంట**
**రామయ తండ్రీ!....."**

అహల్యా వృత్తాంతాన్ని అమాయికంగా మననం చేసుకొని, అయ్యా! రామయ్యా! నీపాదధూళి సోకితే రాయి అడది అయిందట! నా జీవనాధారం యీ పడవ; మరి దీనికి నీపాదం తాకితే అది స్త్రీగా మారిపోతే నాకు యిబ్బంది. అందుకని ఒకసారి కాళ్లు కడగనీయమంటూ వేడుకున్నాడు గుహుడు రాముడిని. ఇక్కడి మధురభక్తి అమాయక భక్తి భావుకులకు గిలిగింతలు కలిగించకమానదు.

**పదములే చాలు రామా!**
**నీ పదధూళులె పదివేలు నీ పదములె....**
**నీ దయగౌతమి గంగా రామయ**
**నీ దాసులు మునుగంగా**
**నా బ్రతుకొక నావా దానిని**
**నడిపే తండ్రిని నీవా! నీ! పదములె! ...**



**కోవెలలోనికి రాలేను నువు**
**కోరిన కానుక తేలేను**
**నినుకానక నిముషము మనలేను**
**నివుకనబడితే నినుకనలేను**
**నీ**
**పదములె చాలు రామా** (బంగారు పంజరం)

అనే గేయం అటుభక్తికీ ఇటు అలంకారాల రక్తికీ ఉదాహరణగా సాగింది.

సినిమా గేయాలలోనూ సామాజిక స్పృహ కనబడుతుంది. ఆకలి చిత్రంలోని ఇదిగో స్వర్గద్వారం, కార్మికులం మేమే కర్షకులం మేమే అనే పాటలో అభ్యుదయ భావం, 'రక్తకన్నీరు' లోని 'ఇంటగల అబలలను కంటగించేరు' అన్న పాటలో స్త్రీలపట్ల సానుభూతి. ఆమె వేదన పట్ల అనుకంప, మంచిరోజులొచ్చాయి' అన్న చిత్రంలో నింగితో నీడ అన్నది ననుతాకరాదనీ అనే పాటలో

**"అంటరానితనము ఒంటరితనము**
**అనాదిగా మీజాతికి అదేమూలధనము**
**ఇక సమభావం సమధర్మం.**
**సహజీవనమనివార్యం**
**తెలుసుకొనుట మీధర్మం.....**
**అనే పాదాల్లో అభ్యుదయ భావంగోచరిస్తుంది**
**"అడుగడుగున గుడివుంది**
**అందరిలో గుడివుంది,**
**ఆ గుడిలో దీపముంది**
**అదియే దైవం ....." అన్నగేయభాగాల్లో**
**"మనిషైతే మనసుంటే**
**కనులు కరగాలిరా**
**కురిసి జగతి నిండాలిరా...." అనే పాటలో**

సర్వమానవ సౌభ్రాతృత్వం, మానవతా దృష్టి వ్యక్తమౌతాయి.

**చూపులు ఎదురు చూపులు, కలయిక కలలు, జంట పదాలుగా సాగుతాయి.**
**చూపులకన్నా యెదురు చూపులే**
**తియ్యన,**
**కలయిక కన్నా**

కలలె మిన్న -అనే భావం. కృష్ణశాస్త్రినీ ప్రభావితుని చేసింది. ఈయన వర్ణనలలో సంభోగశృంగారానికంటే వియోగశృంగారానికే యెక్కున ప్రాధాన్యత వుంటుంది. ఆంధ్రాషెల్లీకదా! అంతేమరి.

(Our Sweetest songs are those that tell of saddest thoughts shelly)

'మాయని మమత' చిత్రంలో రానిక నీకోసం సఖీరాదిక వసంతమాసం-అన్నా

భాగ్యరేఖలో

**నీవుండేదాకొండపై**

**నాస్వామి**

**నేనుండేదీనేలపై-అన్నా,**

చేరుకోలేని, కూడలేని విరహాన్ని వ్యక్త పరచేవిగానే వుంటాయి. అయితే తళుక్కున వెరిసి మాయమయేటంత స్వల్పంగా స్ఫురించే సంభోగశృంగారాన్ని వర్ణించే గేయాలూ కృష్ణశాస్త్రివి లేకపోలేదు.

**చుక్కలతో చెప్పాలని**

**ఏమనీ**

**ఇటుచూస్తే తప్పనీ**

**ఎందుకనీ**

**ఇక్కడ ఏకాంతంలో**

**యేమోయేమో యేమో అనీ -**

**అనేవి, అట్లాంటిగేయాలేమరి**

సమాజంలోని వ్యక్తి మీద పూర్వీకుల ప్రభావం వుంటే, తర్వాతివారి మీద ఈతని ప్రభావంవుంటుంది. అదికాకతాళీయంగానైనా కావచ్చు అనుకరించడం ద్వారానైనా కావచ్చు.

కొందరి ప్రభావం కృష్ణశాస్త్రి పైవుంటే, మరికొందరిపై కృష్ణశాస్త్రి ప్రభావంవుంది.

పండిత జవహర్‌లాల్‌నెహ్రూ అభిమానించే

Robert Frost రచన "The Snowy Evening in the woods...

.... And miles to go before I sleep..."

ప్రభావం ఆకులో ఆకునై అనేగేయంమీద స్పష్టంగా వుంది. అనుసరించినాడో, అనుకరించినాడో అనికాదు. ఏకకాలంలో వున్నా, వేర్వేరు కాలాల్లోవున్నా ఇరువురికీ అట్లాంటి భావాలు రావచ్చు.



కృష్ణశాస్త్రి ప్రభావం తరువాత కవులెందరి మీదనో కలదు. 1938లో కృష్ణశాస్త్రి బ్రహ్మసమాజం కోసం రాసిన నానోట నీమాట గానమయ్యేవేళ అనే పాట ఆత్రేయగారి నాపాట నీనోట పలకాల చిలకా కు ప్రేరణకలిగించింది. ఇట్లాంటివి యింకెన్నో ఉదాహరణలు.

**"ఎంతబాగాఅన్నావు**

**ఎవ్వరు నేర్పిన మాటరా!**

**వేలెడంతలేవుగాని**

**వేదంలా విలువైన మాటా..."**

**"నాదారి యెడారి...."**

**వంటి గేయాలు సాదా సీదా సంభాషణలుగా కనబడితే....**

**ద్వారానికి తారామణిహారం**

**హారతి వెన్నెల కర్పూరం....మొదలైనవి**

**ప్రౌఢమై యిప్పటికీ చర్చలకు తావిస్తుంటాయి.**

కృష్ణశాస్త్రి చలన చిత్రగీతాలు మిగతాయెంతో మంది సినీరచయితలతో పోల్చినపుడు రాశి తక్కువేయైనా, వాసిలోచాలమంది కంటే, లేక అందరికంటె మిన్న అంటే అతిశయోక్తి కాదేమో! సినిమా గేయాలకు సాహిత్యపు విలువలను సంతరించుకున్న చాల తక్కువమంది సినీకవులలో కృష్ణశాస్త్రి ప్రప్రథముడు. ఆయన భౌతికంగా లేకున్నా తెలుగు సాహిత్యం వున్నన్ని రోజులూ కృష్ణశాస్త్రి సహృదయ హృదయ పీఠాలపై ఆసీనుడైవుంటాడు.

శ్రీ శ్రీ కృష్ణశాస్త్రి పై రాసిన స్మృతి కావ్యంలో

**"ఆంధ్రదేశం నిలువుటద్దం బద్దలయింది**

**షెల్లీమళ్లీ మరణించాడు**

**వసంతం వాడిపోయింది" అంటాడు.**

అయినా ఒక సుందర దృశ్యాన్ని చూసినా, మధుర గీతాన్ని విన్నా, మనోహరకవిత చదివినా కృష్ణశాస్త్రి స్మృతి మనోవీధిలో తళుక్కుమనక మానదు. ధన్యజీవికి అది చాలు!

**(తెలుగు భాగం,**
**జాతీయ సెమినార్,**
**వివేచన**
**ఉస్మానియా విశ్వవిద్యాలయం**
**1997 - ఏప్రిల్.)**

# 5. జాషువా పదప్రయోగ వైశిష్ట్యం

**అరిది విలుకాని**
**యుజ్వలశర మొక్కని నొంచు**
**తప్పి చనినంజను**
**నే! ర్పరియైన వాని**
**నీతి! స్ఫురణము**
**పగరాజు నతని భూమింజెరచున్. (మహాభారతం)**

నేర్పరియైనవాని స్ఫురణ పగవానిని సాధించినట్లే, సమర్థుడైన కవి శబ్ద పరంపర సహృదయ హృదయాల నుర్రూతలూగిస్తుంది. ఓహో! అని పిస్తుంది. వస్తువులో, అధునికతా, మార్గంలో సంప్రదాయాన్ని కలబోసి విశిష్ట పదాలను ప్రయోగించడంలో జాషువాకు జాషువాయే సాటి.

ఒక సందర్భంలో కవి ఒక పదాన్ని ప్రయోగిస్తే, దానికి సమానార్థకమో, పర్యాయమో అయిన మరోపదాన్ని, మొదట కవి వాడిన పదం స్థానంలో దానికి బదులుగా వాడితే, కవి ఉద్దేశించిన భావం రాదు. సహృదయుల హృదయాలకు హత్తుకోదు. ఆ మొదటి పదాన్ని తొలగించడానికి పాఠకుల హృదయాలను దూసుకపోతాయి. తామనుకున్న భావాన్నీ అద్దంలోలాగా స్పష్టపరుస్తాయి. జాషువా కవిత్వానికున్న గొప్ప గుణాల్లో ఈ పదప్రయోగ విశిష్టత బంగారాని కబ్బిన సువాసనలాంటిది ఈ విషయం ఆయనే స్వయంగా-

**"నా కవిత్వంబునందు రత్నములు కలవు**
**వాని బెకలించి చూచెడు వాడు లేడు..." అంటాడు.**

సాహిత్యం ఆలోచనామృతం, సంగీతం అపాతమధురం. జాషువా కవిత ఈ రెండింటికీ ప్రతీక. ద్రాక్షా పాకానికి జాషువా పద్యాలు లక్ష్యాలు. సార్థకమైన సంబోధనలు, చక్కని జానుతెనుగు, సంస్కృత సమాసాలూ, పదాలు, పద బంధాలూ, నుడికారాలు జాషువా తూణీరం నుండి మాత్రమే వెలువడతాయి.

గజనీ మహమ్మదు మాట తప్పినపుడు పిరదౌసి అతని నధిక్షేపించాడుః

**"అల్లాతోడని పల్కి నా పసిడి కావ్యద్రవ్యమున్ వెండితో**
**చెల్లింపన్ దొరకొన్న టక్కరివి! ....."అంటాడు.**

మాట తప్పిన మహమ్మదగ్రణికి మరొక పదం తాకదు. ఇది సార్థకమైన సాభిప్రాయ సంబోధన



రస భావ స్ఫూర్తిని కలిగించడమే పదప్రయోగ ప్రయోజనం. లక్షణ విరుద్ధమన్న దృష్టితో వెలివేయబడి, శబ్దకోశాలకెక్కక ప్రజల నాల్కల్లో మాత్రమే నిలబడిపోయిన నుడులకు గుడులుకట్టే యత్నం గంటలు కొట్టి, మీసలు, దువ్వి, పండితులమీద సవాలొనరించి తిరుపతి వేంకటకవులు చేశారు. ఈ యత్నం. ప్రవాహినీదేశ్యా' అనే నన్నయ ఆంధ్ర శబ్ద చింతామణికిమైన చట్రంలో అధునికమైన ఆలోచనా సరళిని బిగించి, ఇవి మన పదాలుకావు అని మడికట్టుకొనక, ప్రపంచ భాషల పదాలనెన్నిటినో తన కవితలలోనికి అహ్వానించిన మొదటి కవి జాషువా, "We can not keepout foreign words as we can keepout foreign goods. Perhaps Telugu acepts thems more easily than any other Indian Language అన్నవి JBS - HELTEN" వాక్యాలు, జాషువా రచనల్లో ఆంగ్ల, అరబ్బీ, పారశీక, హిందీ ఉర్దూ పదాలు మామూలుకంటే ఎక్కువ మోతాదులోనే కనబడుతాయి; దానికి కారణం జాషువా కవితల ఇతివృత్తాలు అటువంటివి కావడం; క్రీస్తు చరిత్ర ఆంగ్ల పదాలు లేకుండా వ్రాయడం కుదరదు. పిరదౌసి, ముంతాజ్ మహల్, జెబున్నీసా పారసీ ఉర్దూ పదాలు లేకుండా రాయలేరు. అలా వ్రాస్తే స్వారస్యం దెబ్బతింటుంది. సహృదయంతో విశ్వ భాషా పదాల నెన్నిటినో సగౌరవంగా రసపోషకంగా వాడుకున్నాడు కాబట్టే జాషువా GLOBEL MAN అంటే విశ్వమానవు డయ్యాడు. ఆవిషయం అయనే స్వయంగా చెప్పినాడు-

**"కుల మతాలు గీచుకొన్న గీతల జొచ్చి**
**పంజరాన కట్టు వడను నేను**
**నిఖిల లోకమెట్లు నిర్ణయించిన నాకు**
**తిరుగులేదు విశ్వనరుడ నేను" అని,**

జాషువా శ్రేష్ఠుడైన కవి. ఛిద్రాన్వేషులు కొందరు కులాన్ని సాకుగా ఆయన నవమానపరచే వారట. ఆ సందర్భంలో -

**నా కవితా లతాంగి వదనమ్ము**
**నెగాదిగ జూచి రూపరే**
**ఖా కమనీయ వైకృతుల గాంచి**
**భళా భళి యన్నవారె మీ**
**దేకుల మన్న ప్రశ్న వెలయించి**
**చివుక్కున లేచిపోవుచో**
**బాకున కుమ్మినట్లగును పార్థివచంద్ర**
**వచింప సిగ్గగున్" -అంటాడు జాషువా,**

ఈ 'చివుక్కు' అనే పదప్రయోగం ఎదుటివారు తనపై, తన కవితలపై చూపించే విసుగును, ఈసడింపును, తర్వాత బాకున కుమ్మినట్లు కావడాన్ని ధ్వనింపజేస్తుంది. ఈ పదానికి బదులుగా

'గిరుక్కు' అనే మరో జగణం వేయవచ్చు. గణం కుదురుతుందే తప్ప, భావస్ఫురణ కలగదు. ఉద్దేశితార్థం నెరవేరదు.

**దానికి సమాధానంగా జాషువా-**

**"గవ్వకు సాటిరాని పలుగాకుల మూకలసూయచేత**

**నన్నెవ్విధి దూరినన్ నను వరించిన శారద లేచిపోవునే**

**ఇవ్వసుధాస్థలిన్ గలుగరే రసలుబ్ధులు గంట మూనెదన్**

**రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరించెద నాంధ్రవాణికిన్"**

అన్నాడు. అకారణంగా తనను విమర్శించేవారు గవ్వకు సాటిరానివారన్నాడు. 'వివాహేన వివాదేన సమయోరేవశోభతే" కదా! విద్వత్తు లేనివారు అసూయతో అంటున్నదే తప్ప సత్తాతో అన్నది కాదనీ, వారిని లెక్కచేయననీ అన్నాడు. తనను వరించి వచ్చిన సరస్వతీ వీరితాటాకు చప్పుళ్లకు బెదిరి లేచిపోదన్నాడు. వాళ్ళ కళ్ళు మిరుమిట్లు గొలిపేటట్లు తన కవిత్వంలో రవ్వలు రాలుస్తానన్నాడు.

గవ్వకు కొరగానివారనే ప్రయోగం మనకు వుండనే వుంది. గవ్వకు సాటిరాని, కాకుల మూకలు, వరించు సరస్వతి లేచిపోవునే, రవ్వలు రాల్చెదన్ మొదలైన పదాలు జాషువా అధిక్షేపానికి అద్దం పట్టేవి.

జాతీయాలు, పదాలు పదబంధాలు వాడడంలో జాషువాది అందెవేసిన చేయి. 'భీష్ముడు' అనే ఖండికలో భీష్ముని యౌవనాన్ని చిత్రించడానికి-

"కోడెవయస్సు నిన్నలిమి గోటికిమీసము చిక్కునాడు..." అంటాడు. గోటికిమీసం చిక్కడం అనేది జాతీయం. 'కొనగోటికి మీసం అందుతుంటే' కోటిలోకాలు కనపడ' వనేదీ, 'మీసాలు వస్తుంటే లోకాలు కనపడ'వనేవి సామెతలు, వీటిని జాతీయాలుగా ప్రయోగించి, భీష్ముని వయస్సును, బలపరాక్రమాలనూ, చెప్పక చెప్పినాడు. భీష్ముని చిరకాల జీవనాన్ని చెప్పడానికి-

**"వృద్ధవీరుడ నీ వయస్సెంత చెపుమ!**

**తండ్రి మరణించియే మూడుతరములయ్యె"**... అన్నాడు. తండ్రి మరణించే మూడుతరాలయింది. ఇంకా ఈతను బ్రతికే వున్నాడు. అంటే, అతని వయస్సెంతో వివరించి నట్లే అయింది. ఇది సాభిప్రాయ పదప్రయోగం.

"అంబ శిఖండి యయ్యె

అతడాడుది..." అనేది చమత్కారమైన ప్రయోగం.



అతడు మగవాడు + ఆమె ఆడుది అనే రెండువాక్యాల సమాహారమే అతడాడుది అనే ప్రయోగం సందర్భానుసారంగా కుదిరి చమత్కారాన్ని తళుక్కుమనిపించింది.

సత్యహరిశ్చంద్ర నాటకంలోని కాటికాపరి దృశ్యప్రదర్శనలో, జాషువా వ్రాసిన శ్మశాన వాటికలోని పద్యాలు తప్పక ఉండితీరాల్సిందే. అవి లేకుంటే అక్కడి పాత్రపోషణలో ఔచిత్యమే కొరవడుతుంది.

**ఇచ్చోట ఏ సత్కవీంద్రుని కమ్మని**

**కలము నిప్పులలోన కరిగిపోయె**

**ఇచ్చోట నేలేత యిల్లాలి నల్లపూ**

**సలసౌరు గంగలో గలసిపోయె.....**

**..ఇది నిటలేక్షణుండు పిశాచులతో**

**గజ్జె గదలించి యాడు రంగస్థలంబు.....**

అంటాడు. ఎంతవారికైనా చివరి మజిలీ శ్మశానమనేది జగమెరిగిన సత్యం. ప్రపంచమంతా వెదికితే ఇక్కడ మాత్రమే సామ్యవాదం కనబడుతుంది. తెలిసిన విషయాలే అయినా చెప్పేతీరు హృదయాన్ని కదలిస్తుంది. కరిగిస్తుంది. గజ్జె కట్టి ఆడడం అనే ప్రయోగం వుంది కాని, గజ్జె కదలించి ఆడడం ప్రత్యేక ప్రయోగం.

పర్వతమూ, పరమాణువూ రెండూ కవి దృష్టికి సమానమే. రెండూ వర్ణ్యవస్తువులే. జన్మకెంత ప్రాధాన్యత వుందో, మృత్యువుకూ అంతే. ఈ లోకాలకు దిగివస్తున్న దేవదూత శిశువు, జాషువా. శిశువును గురించి, వెర్రిబాగులాడు,

**గాన మాలింపక కన్ను మూయని రాజు,**

**ఉయ్యేల దిగని భాగ్యోన్నతుండు,**

**సతిని ముట్టని సాంబమూర్తి,**

**నిర్గుణుడు**

**మోహనుడు**

**బట్ట గట్టడు,**

**బిడియాన పట్టు వడడు,**

**దిగంబరుడు-**

మొదలైన ప్రయోగాలు చేశాడు. శిశువులు సాక్షాత్ భగవత్ స్వరూపులు. పెరిగి మానవులై, మంచి చెడ్డలకు మరిగి దైవస్థాయి నుండి పతనమౌతున్నారని చమత్కరించడమే ఉద్దేశం. శ్లేషకోసం పాకులాడడం కానేకాదు. ఈ పదాలలోతుల్లోకి తొంగిచూసి ఆలోచించినపుడు

మాతృత్వాన్ని అనుభవించిన వారి హృదయాలకు గిలిగింతలు కలుగక మానవు.

రాళ్ళకు పూలు పూయిస్తాడు శిల్పి; ఆ శిల్పిని పట్టుకుని-

"పెనురాతి కంబములకు

కుసుమ వల్లరు లేరీతి గ్రుచ్చినావు..."

అంటాడు కవి. పూలకూ, గ్రుచ్చబడడానికీ ఆవినాభావం. ఇక్కడ కూర్చడం కాదు-కుచ్చడమే అసలైన పదం, భారతమాతను సంబోధిస్తూ-

**వింధ్యధరా ధరస్తనీ!**
**చలిమల మేల్ముసుంగు దొరసాని!**
**సమశీతోష్ణ సుఖప్రదాయినీ!**

అంటాడు భారతదేశం సమశీతోష్ణ మండలంలో ఉంది కదా! అందుకని ఆ ప్రయోగం;

వీరపూజ ఖండికలో-

**ధరణింగ్రుమ్మరు వింతభాస్కరుడు రాధాపుత్రు**
**డానాడు సం**
**గరభూమిన్ బహువీర సైనిక**
**శిరః కాండంబు జెండాడుచో-**
**నరుణుండుం గను సన్న సేయగ**
**విషాదాప్తితో నీకు జె**
**చ్చెర నుప్పొంగిన చేపుబాలకు జెమర్చెన్**
**రాలు కుంతీసతీ!-**

**అనే పద్యంలో-**

కర్ణుడు భూమిపై తిరిగే వింత భాస్కరుడట! ఆతడు శత్రువులను చెండాడుతున్నప్పుడు సూర్యుడు కుంతికి సైగచేశాడట, చూడు మనవాని పరాక్రమం అని. కుంతికి సందిగ్ధం. చంపుతున్నవాడు తను కన్నవాడు. చంపబడుతున్నవారు తన పుత్రుల పక్షంవారు, అయినా ఆమె మాతృత్వం చేపిందట! అది చూచి రాళ్ళు చెమర్చినాయట! రాల్‌కరగంగ అనే ప్రయోగం వుంది. ఇక్కడ రాళ్లు చెమర్చినాయి; ఆయ్యోపాపం! అని. అదీ జాషువా ప్రయోగ పరిపక్వత

గబ్బిలానికి తనగోడు వినిపించే ఆరుంధతీ సుతుడు గబ్బిలాన్ని 'ఖగరాజ్ఞి' అన్నాడు. ఆలయానికి శివుడు రాజు. అధిపతి. యజమాని ఈమె రాణి. పూజారి లేనప్పుడు ఏకాంతంలో



తన గురించి చెప్పమన్నాడు యజమాని చెవికెక్కేటట్లు చెప్పాలంటే, ఏకాంతం అవసరం కదా!

"నీ బందుగుల్ కొంపల్గట్టి నివాసముండెదరు.." అన్నాడు.

కొంప-ఇల్లు; ఇది అర్థపారుష్యానికి ఉదాహరణ. పతనావస్థలోనున్న ప్రాంతాలే గబ్బిలాలకు ఇళ్ళు అవేకొంపలు.

"అప్పు వడ్డది సుమీ భరతావని వీని సేవకున్...."

అప్పు ఉండడం వేరు, అప్పు పడడం వేరు. ఆప్పుపడడం తీరని ఆప్పు. శ్రీ వేంకటేశ్వరుడు కుబేరునికి అప్పువడినాడు. కలియుగమున్నన్ని నాళ్ళు ఏటేటా చెల్లిస్తే, వడ్డీ మాత్రమే తీరుతుంది. అసలు అట్లాగే మిగులుతుంది. అట్లే భారతజాతి సైతం అరుంధతీసుతునికి అప్పువడ్డది ఎంత చేసినా అది తీరనిది. వాని ఋణం తీరేది కాదు.

జాపూజీ ఖండకావ్యంలో-

**"అలిగి కూర్చుండు చిన్న బిడ్డల విధాన**
**నుపవసింతువు భువన ముగ్రూతలూగ**
**విశ్వములకెల్ల గారాల బిడ్డ వకట**
**చంపు కొన్నది భారత క్ష్మాతలంబు...."**

అన్నాడు జాషువా. గాంధీజి ఉపవాసం చేస్తే భువనము ఉగ్రూతలూగుతాయి, ఆయన విశ్వమునకెల్ల గారాల బిడ్డ. భరతమాత ముద్దుబిడ్డ ఆ భరత మాతే ముద్దుబిడ్డను చంపుకొన్నది. చంపినది. చంపుకొన్నది, పదాల్లో ఎంతో తేడా. 'చంపుకొన్నది' స్వార్థప్రయోగము.

ఆంగ్లేయులు మనకు స్వాతంత్ర్యాన్ని ఇస్తున్నట్లుగానే నటించి హిందూ ముస్లిం నాయకులను చర్యలకు పిలిచారు. వాస్తవంగా మనకు స్వాతంత్ర్యం ఇవ్వడం, మనం సామరస్యంగా ఉండడం వారికి సుతరామూ ఇష్టం లేదు. అందుకే వారు పెట్టిన మెలికలు ఎట్లున్నాయో చెబుతాడు జాషువా-

**"హిందువుల జుట్టుతోడ సాహెబులదాడి**
**పెనచి ముడివైచి రాజీకీ పిలిచినారు....."**

చర్చలు జరిగేకొద్దీ పరిస్థితి జటిలంకావడం నేటికీ మనం గమనిస్తూనేవున్నాం. దానిని కవి చమత్కరించడం గమనార్హం

పిరదౌసి కావ్యంలో జాషువా పారసీపదా లెక్కువ వాడినాడు. ఇతి వృత్తానికి అనుకూలంగా అలా వాడడమే సమంజసము.

"తదంతరాంతర వితానత

కొండొక పిచ్చివానిగన్...." కపపడ్డాడు జాషువాకు. ఆ పిచ్చేమిటో తానూ అనుభవించినవాడే కాబట్టి, సరిగా చెప్పగలిగాడు. కవి అంతర్ముఖుడై తనలో తాను మననం చేసికోవడం నిజంగా బయటివారికి పిచ్చిలాగానే కనబడుతుంది; సమాజంలో వుంటూ మోదములోన మోదమైపోవడం ఖేదములోన ఖేదమైపోవడం కవుల మొదటి లక్షణం అనుభవించి చెప్పిన విశిష్ట పదమిది.

రాజ దర్బారులో పిరదౌసి కావ్యపఠనం చేస్తే, శ్రోతలు కిక్కురు మనకుండా విన్నారు. ఆ వినడాన్ని, జాషువా ఆ కొలువును కవిరాజుగా ఏలు కొన్నాడు అంటాడు. గజనీ మహమ్మదు కృతఘ్నత తెలిసి-ఎన్నో కొండలు గుండెలో కరిగిపోయినవట! ఆశలు కొండలు. అవి కరిగి కారిపోయినవి. "వార్ధిసంతానముల్ కన్నీరయ్యె" అత్యుత్తమమైన అతిశయోక్తి.

"కులీనుడైన రా జిక్కరణిన్ మృషల్వలుకునే? అని ప్రశ్నించినాడు. ఈ ప్రశ్న మనలను ఎంతో దూరం తీసుకుపోతుంది.

**ఈతను కులీనుడైన రాజు**
**కులీనుడైన రాజు అబద్ధాలు మాట్లాడడు.**
**ఈతడు మాట్లాడినాడు**
**ఐతే కులీనుడు కాడు.**
**రాజూ కాడు.**
**ఇదీ ఈ ప్రయోగంలోని వ్యాజనింద.**
**ఇక్కడ కవి. న్యాయ నిర్ణేతయై, వాదోపవాదాలు విని తీర్పు చెపుతాడు.**
**"సత్య వాక్యం బెవం డుల్లంఘింపడో వాడె పోనరుడు**
**సత్య వాక్యాన్ని దాటనివాడే మనిషి**
**నీవు సత్య వాక్యాన్ని దాటినావు.**
**మనిషివే కావు.**
**ఇదీ కవి తీర్పు. అదీ కవి హృదయం,**
**"ముత్యముల కిక్కయైన సముద్రమునను**
**పెక్కుమారులు మున్కలు వేసినాడ భాగ్యహీనుడ ముత్యమ్ము బడయనైతి**



**వనధి నను మ్రింగ నోరు విచ్చినది తుదకు....."**

ఆనే పద్యం పిరదౌసి వ్రాశాడన్నాడు జాషువా. ఇక్కడ పిరదౌసి జాషువే. సమాజమనే సముద్రంలో ఎన్నోసార్లు మునిగినాడు ప్రతిఫలం లేదు. సరిగదా! అవమానాలే ఎదురైనాయి ఆత్మాశ్రయంతో అన్యాపదేశంగా చెప్పిందే ఈ పద్యం.

చివరగా జాషువా జీవిత సాహిత్య ప్రస్థానంలోని పరమసత్యం-సందేశం

**"కోటానుకోట్ల నరులొక**
**మేటి జగన్మాతృసుతులు మిత్రులని మదిం**
**జాటింపు మీ సువార్తన్**
**చాటింపుమి జీవితంబు సార్థక్యమగున్"**

ఈ సువార్తలో వసుధైక కుటుంబ భావనతోపాటు దాని రూఢ్యర్థమూ స్ఫురిస్తుంది. అదే ఆయన సందేశం.

వాడియైన, శక్తివంతమైన పదప్రయోగాలతో ఎదుటివారి హృదయాలను జయించడం, వశపరచుకోవడం, నేర్పరియైన జాషువాకే చెల్లుతుంది.

**తెలుగు విభాగం**
**జాతీయ సెమినార్**
**వివేచన**
**ఉస్మానియా విశ్వవిద్యాలయం**
**ఫిబ్రవరి 1995**

# "కిన్నెరసాని తెలుగింటి దొరసాని"

**వేయి వెలుగుల సూర్యుడు విశ్వనాథ**
**సాహిత్య సహస్ర కిరణుడు విశ్వనాథ**

ఒక్కొక్క కిరణం తెలుగు సాహిత్యంలోని ఒక వైవిధ్యాన్ని స్పృశించి, సుసంపన్నమూ, పునీతమూ చేసింది, వచన ప్రక్రియ చేపడితే ధర్మగ్లానిపైన వేయిపడగలు పూత్కరిస్తాయి సంప్రదాయ కల్పవృక్షాలు నాటితే, అవి జ్ఞానపీఠాధిష్ఠితాలౌతాయి. కడిమిచెట్ల మొలకలు వేస్తే, అవి పెరిగి వీరగంధాలను ప్ర[illegible]స్తాయి. ఆంధ్ర పౌరుషాన్ని ధర్మనిష్ఠను ఆవిష్కరిస్తే విజయవాటికలో కనక వర్షాలు కురుస్తాయి. చెలరేగిన కాంక్షలు చెలియలి కట్టలను దాటవు. వెలిగిననేపాళ దీపకళికలు దిండుకింద పోకచెక్కలను సృజిస్తాయి! చిట్లీచిట్లని గాజులను చిత్రిస్తాయి. గుండె గాయాన్ని గేయం తాకితే, రసహృదయుల హృత్తంత్రులు మ్రోగి కిన్నెరనాదం వినిపిస్తుంది సరస హృదయులను అనందడోలల ముంచి తేలుస్తుంది.

విశ్వనాథ బహుముఖ ప్రజ్ఞకు తార్కాణాలవి. పట్టిందానిని బంగారం చేసే పరుసవేది విద్య, అయన అరచేతికి అంకితమయింది. ఆయన యేది రాసినా మనలను బాగా అకర్షించేది-ఆయన భావనాశక్తి. ఒక దృశ్యాన్ని వర్ణించినా, పాత్రను చిత్రించినా, కథను నడిపించినా, ఉత్తమ భావుకుడూ, ప్రజ్ఞావంతుడూ, దీశాలీ, రసపిపాసీ, సంప్రదాయవాదీ కనిపిస్తాడు.

వ్యుత్పత్తి ఆధారంగా ఆదినుండి సాగుతూ వచ్చిన ఆంధ్ర కవిత దిశమారి దశమారి, ప్రతిభకు పట్టంకట్టి, గేయం పుట్టుకు వచ్చింది. ఆ దశలో వచ్చినవే యెంకిపాటలు, యెంకిపాటలు నండూరి సుబ్బారావుగారు సభలలో కమ్మగా పాడుతూ వుంటే, వారికి లభించిన జనాదరణను ప్రత్యక్షంగా చూచి విశ్వనాథ, కిన్నెరసానిని సృష్టించారంటారు.

భద్రాచలానికి దిగువన గోదావరిలో దక్షిణపు వైపు నుండి కలిసే ఒక వాగు కిన్నెరసాని. పేరు రమ్యంగా, ఆకర్షకంగా వుంది. విశ్వనాథవారు ఈ పేరునుబట్టే కథను దొంతరలుగా పేరుస్తూ పోయారు.

ప్రతిభా శాలియగు కవి జడ ప్రకృతికి సైతం సంపూర్ణ మానవత్వము నాపాదిస్తాడు శిలలను పలికిస్తాడు; రాలను గరిగిస్తాడు. నదులను నటింపిస్తాడు. వృక్షముల నడిపిస్తాడు నెమళ్ళచేత ఆడిస్తాడు, కోయిలలచేత పాడిస్తాడు. సర్వకాల సార్వజనీనమై, నిర్మలానంద



రసోదయమున కాస్పదమగు కావ్య శిల్ప సృష్టి గావిస్తాడు. లోకమున కొక సందేశము నిచ్చి తానూ సంతోషపడతాడు.

విశ్వనాథవారు చేసిందదే.

సుమారు 1923 ప్రాంతంలో విశ్వనాథవారు భద్రాచలాన్ని సందర్శించారు. అపుడు దగ్గరలోనే ఒక కొండ, ఆకొండను చుట్టుకొని ప్రవహిస్తున్న నదీ ఆయన దృష్టిని బాగా ఆకర్షించాయి. ఆ నదిపేరు వాకబుచేసి పులకించి పోయాడు. అదే కిన్నెరసాని. అందమైన పేరు! అంతే!! ఆయనలోని భావతీవ్రత అయనను నిలువనీయలేదు. ఒక మనోహర దృశ్యం, అందమైన పేరు. అమిత భావుకుడు, భావతీవ్రత నాపుకోలేని రసలోలుపత; ఊహ రగిలి గుండెకదిలింది. కరుణరసాత్మక సందేశఘట్టం హృదయ ఫలకంపై తళుక్కుమన్నది. ఒక జీవిత కథకు ప్రతీకాత్మక నందేశ దృశ్యం ఆయునముందు సాక్షాత్కరించింది. సాక్షాత్కరించినదానినే చిత్రించాడు విశ్వనాథ. అదే కిన్నెరసాని అయింది.

అత్తలేని కోడలుత్తమురాలు; కోడలులేని అత్త గుణవంతురాలు; అనే కాకుస్వర వ్యంగ్య వాక్యాలు వింటూనే వుంటాం. అత్తా కోడళ్ళు అనంగానే గొడవలు వినబడుతుంటాయి, కనబడుతుంటాయి. అట్లాంటిదే యీ కథ. చిన్న సంఘటన చుట్టూ చిత్రంగా కథనల్లి ప్రతీకాత్మక సందేశాన్నివ్వడంలోనే కనబడుతుంది ప్రతిభ.

అత్త ఆరళ్ళు, కోడలి కోపతాపాలు మామూలే అయినా ఆ ఆరళ్ళు మితిమీరి భరించలేక, ఆవేశపడి, ఇల్లువదలింది కోడలు కిన్నెరసాని. ఆలోచనలేని ఆవేశంతో అడవుల వెంటబడి పరుగెత్తింది. అబల, ఆవేశం తోడయింది అనర్థం కలుగుతుందేమోనని ఆమె భర్త ఆమెనోదార్చడానికి పరుగెత్త ప్రయత్నించాడు. కొంతవరకు విశ్వనాథ ఉపోద్ఘాతంలా వచనంలో చెప్పి, కిన్నెరను వెంటనంటి పరుగెత్తి ఆమె నోదార్చ యత్నించిన ఆమె భర్త యత్నాలతో గేయం ప్రారంభిస్తాడు

**తనయెడ తప్పేయున్నది**
**అనుకోవే నాథుని దెస**
**వనితలు నీవలె కఠినలు**
**కనిపించరువే యెందును**
**ఓహో ! కిన్నెరసానీ**
**ఓహో! కిన్నెరసానీ!**

**అని, ఆమెను ఆప యత్నిస్తాడు.**

కావ్యాలకు ఈ రీతిగ ముందు కథను జెప్పి, తర్వాత కథను ప్రారంభించడం ఖం' కావ్యాలకు నిండు రూపం రాక, కావ్యం ఖండమైపోతుందనే అభిప్రాయమూ వుంది.

కిన్నెరసాని పాటలు కేవలం కల్పిత కథను మాత్రమే చిత్రిస్తే, ఇంతగా వాని చర్చ చేయాల్సిన అవసరమే ఉండేది కాదు. కిన్నెరసాని పాటలు పాతవైనా ఆధునిక గృహిణి జీవిత చిత్రణకు ప్రతీకలు!

కిన్నెర నీరై ప్రవహించినప్పటినుండి భర్త పొందిన వేదననంతా కిన్నెర పుట్టుక, అనీ; పతిరాయివలెమారి పడియున్నచోటునే విడలేక తిరిగి జలదేవతల వెంట కిన్నెర సాగిపోవుటను కిన్నెర సంగీతమనీ; తగని మోహముతో కడలి రాజుపొంగుటను కిన్నెర దుఃఖమనీ; ఇంకా, కిన్నెర నడకలు, కిన్నెర నృత్యము, కడలి పొంగు, గోదావరీ సంగమము; కిన్నెర వైభవము; అని ఎనిమిది శీర్షకలతో కిన్నెరసాని పాటలు సాగినవి.

అత్త ఆరడి, భర్తమౌనం -ఈ రెండూ భరించరానివై ఆలోచనలేని అవేశం కలిగించి , కిన్నెరను అడవులవెంట పరుగెత్తింప జేసినవి. ప్రమాదాన్ని పసిగట్టిన భర్త ఆమె వెంట పరుగెత్తి, ఆగమని ప్రార్థించాడు; అడుక్కున్నాడు, ప్రాధేయపడ్డాడు. కౌగిట్లోనే ఆమె కరిగినీరై ప్రవహించింది. ఆమె నీరైపోవడాన్ని గమనించిన భర్త.

**నీవు మహాపతిశీలవు**
**కావని నేనంటి నటే!**
**అటులంటిన నా కంఠము**
**కటారి తెంచక పోతిన!**
**ఓహో కిన్నెరసానీ!**

**అనీ-**
**నీ జఘనము నిసుక తిన్నె**
**గా జూచిన నా కన్నులు**
**ఊడిపడవు నేలపైన**
**ఉరిసిపోవు లోనె లోనె**
**ఓహో కిన్నెరసానీ!**

అనీ, బాధపడి, నిన్ను పోగొట్టుకున్న నా జీవిత మెందుకు; నా కనులు పోనీ, నాకీ దృష్టి యెందుకని, యని ఆమె మీద తనకున్న గాఢమైన ప్రేమను చాటుకున్నాడు. అంతేకాడు. ప్రియురాలిని పోగొట్టుకొని నిశ్చేష్టుడైనాడు. చైతన్యహీనుడైనాడు:

**నీకై యేడిచి యేడిచి నా కంఠము సన్నవడియె**
**నా కన్నులు మందగించె నా కాయము కొయ్యబారె**



**ఈ యేడుపు రొదలోపల నా యొడలే నేనెరుగను**
**నా యీ దేహమిదేమో రాయివోలె నగుచున్నది**
**ఓహో! కిన్నెరసానీ!**

అంటూ ఆమెకై విలపిస్తూనే శిలైపోయాడు భర్త. తా నవివేకి, కఠినయై చేసిన పనికి, తనప్రియుడు శిలయైపోయాడు. అపుడు కిన్నెరకు తన స్థితి-

**తొడిమ యూడిన వూపు పడతిలా తోచింది**
**బెడుగుపోయిన రత్న పేటిలా తోచింది.**

**అందుకే-**
**పతి రాయివలె మారి పడియున్నచోటునే**
**పడతి కిన్నెరసాని విడలేక తిరిగింది,**
**ముగుద కిన్నెరసాని వగచెంది తిరిగింది**
**వెలది కిన్నెరసాని గలగలా తిరిగింది.**

తప్పు తెలిసింది; వియోగమనుభవించింది. ఎట్లాగైనా తిరిగి తాను మనిషైతే, తన భర్త కూడా పాషాణత్వంనుండి తిరిగి మనిషై తన నేలుకుంటాడేమోననే ఆశకు లోనైంది కిన్నెర. అంతర్గతంగా తన తప్పు తెలిసి పశ్చాత్తాప పడడం కనబడుతుంది.

**ఏ ఉపాయముచేతనైన మళ్ళీతాను**
**మనిషి కిన్నెరసాని నగుదామ యనిపించి**
**ఆపలేనంత కోరికచేత విలపించి**
**ముగుద కిన్నెరసాని మొరసింది మొరసింది**

ఆమె ఆవేదనంతా గతజల సేతుబంధనమే అయింది. చేతుల కాలింతర్వాత ఆకులు పట్టకున్నట్లే అయింది. ఇదంతా చేజేతులా తాను చేసికొన్నదే నని వాపోయింది కిన్నెర.

**అటువంటి పతితోడ అటువంటి కాపురం**
**బిటు చేసికొంటినం చెక్కడా లేనంత**
**వగచెంది వగచెంది వనిత కిన్నెరసాని**
**వనరింది వనరింది వనిత కిన్నెరసాని.**

ఆలోచన లోపించి, కేవలం ఆవేశపరులైన మనుషుల మనస్తత్వాలకు, ప్రత్యేకించి స్త్రీల మనస్తత్వాలకు ఉదాహరణంగా నిలిచింది కిన్నెర.

**పతి రాయిగా మారి పడియున్న గుట్టపై**
**అతివ తన కెరటాల హస్తాలతో చుట్టి**

**వెతపొంది వెతపొంది బిట్టు ఘోషించింది**
**తన నీటుకాణ్ణి చేతుల కౌగిలిస్తుంది**
**పలకవా! యని మ్రోతపడి పల్కరిస్తుంది.**
**ఓ నాథ! ఓ నాథ! ఓ నాథ! ఓ నాథ!**
**నాకుమల్లే నీవు నదివోలె పారరా!**
**జలముగా యిద్దరము కలసి పోదామురా!**
**కెరటాలు కెరటాలు కౌగిలిద్దామిుర్రా!**
**ఓ నాథ! ఓ నాథ! ఓ నాథ! ఓ నాథ!**
**నీయందు తప్పింక నేను చెయ్యను లేర!**
**ఆన పెట్టితివేని అడుగుదాటను లేర!**
**ఇక జన్మలో కోపమింక పొందనులేర!**
**రార! ఓహో నాథ! రార ఓహో నాథ!**

అంటూ ప్రాధేయపడింది. పశ్చాత్తాపపడింది; యేడ్చింది. ఆమె యేడుపంతా అరణ్య రోదనమే అయింది:

**ముద్దు ముద్దుగ నడచి పోడ వోలిక నాడి**
**మురిపమ్ముగా పాడి ముగుద కిన్నెరసాని**
**యెడదలో యెదురైన బెడదలో కష్టాల**
**కడలియే కలగాంచెనో కన్నీటి**
**కడవలే ప్రవహించెనో!**
**కన్నీటి కడవలు కాలువలు కడుతూంటే, సముద్రంవైపు సాగింది కిన్నెర.**

కిన్నెర తనవైపు వస్తుందని విని సముద్రుడు పొంగినాడు, ఉప్పొంగినాడు.

**తగని కోరిక చేత తనలో కడలిరాజు**
**సొగసు కిన్నెరసాని చూడాలెననిపించి**
**ఉగ్రట్టు లూగెనూ - మిర్రెక్కి చూచెనూ-**

సముద్రుడు కిన్నెరవైపు తగనికోరికచేత చూడడానికి కారణం కిన్నెర ప్రస్తుతం భర్తృవిహీన కావడమే. ఇన్నాళ్లూ భర్తచాటున వున్నది. ఇపుడు ఇల్లు వదలీ సంసారాన్ని పోగొట్టుకొని, ఏకాకియై వచ్చిన దురదృష్టవంతురాలు ఆమె. తలపై నీడ లేకపోవడమే, సముద్రునిలాంటి వారికి ఆమెపై తగని కోరిక కలగ డానికి కారణం కూడా; నాడేకాదు. నేడు ఇట్లాంటి పరిస్థితులే యెదుర్కోవాల్సివస్తుంది. కిన్నెరలా, అనాలోచితమై ఆవేశంతో ప్రవర్తించిన వారు.



తాత్కాలికంగా, క్షణికోద్రేకానికి లోనైనా సంభాళించుకున్నాడు సముద్రుడు.

**ఏనాటి ముసలి యీ కడలీ**
**ఏనాటి పెద్ద యీ కడలీ**
**తిరిగి నలుగురిలోన తిరుగనేర్చిన వాడు**
**పరగ కామమునకై అడలిపోయెనటన్న**
**తనకేమి పరువూ- కడలిరాజునకూ-**

అనుకున్నారు జనం. అనుకుంటారని ఆత్మ విమర్శ చేసుకున్నాడు కడలి రాజు.

**కడలి పొంగిన దంతె గానీ**
**కడలి ఉబికిన దంతె గానీ**
**కడలి తా చెలియలికట్ట దాటునె యంచు**
**కడలి మాత్రము ఒడ్డున గడచిపోవునె యంచు**
**కడగి యనుకొనిరీ బుడుత మానిసులూ.**

లోక వృత్తాలకు లోకులు కాకులై చిలువలు పలువలుగా పలుకడం మామూలే. ఇక్కడా అట్లే జరిగింది. లోకవృత్త పరిశీలనాశక్తితో, అద్వితీయమైన భావనాబలంతో యదార్థ మానవ జీవనచిత్ర ప్రతీకలు నిర్మించారు విశ్వనాథవారు.

నదిని రక్తమాంస శరీరయైన నాయికగా భావించి పాడిన పాటలు మాత్రమే కావు కిన్నెర పాటలు; సంపూర్ణ జీవన విధానానికి ప్రతీకల నెత్తిన ప్రతిభా పతాకలవి. వివేక భ్రష్టసంపాతముల్ పెక్కు భంగులన్నట్లు. కిన్నెర ఆవేశంతో యిల్లు వెడలడం ఆమెకూ, ఆమె భర్తకూ తీరని నష్టాన్ని కలిగించింది. కనీసం జీవితం కూడా లేకుండా చేసింది. కోడలి సంగతలా వుంచితే, ప్రియమైన కుమారుని పోగొట్టుకున్నది ఆ తల్లి. ఆమె అవివేకంవల్లనే సముద్రునిచేత చులకనగా చూడబడింది కిన్నెర. నెత్తిమీద నీడలేని స్త్రీ సమాజంలో చులకనగా చూడబడుతుంది. ఆపదలో ఆదుకునేదే ఆప్తహృదయం. ఉన్నఇంటిని కాదని వెళ్ళి గోదావరి యింటిలో, అంటే. పరుల పంచలో తలదాచుకోవలసి వచ్చింది కిన్నెరకు. కారణం? తన ఆవేశమే. ఇందరిని ఇన్నివిధాలా చలింపజేసింది. ప్రతీకాత్మకమైన సందేశాన్నిచ్చింది. తనవంటి తప్పిదాన్ని మరింకెవరూ చేయొద్దనీ, చేజేతులా బంగారంలాంటి జీవితాన్ని పాడు చేసుకోవద్దనీ సందేశాన్ని ఇవ్వకే ఇచ్చింది.

అందుకే కలికి కిన్నెరసాని తెలుగింటి దొరసాని.

**విశ్వనాథ శతజయంతి సంచిక**
**యువభారతి**
**3-9-1995**

విప్లవ ఢంకా
3

## ఇతర రచనలు

1. విప్లవ ఢంకా (1969)
   (తెలంగాణా ఉద్యమ గేయాలు)
2. జానపద సాహిత్యంలో అలంకార విధానం. (1989)
   (పిహెచ్. డి, సిద్ధాంతవ్యాసం)
3. విశ్వదర్శనం 1990
   (కవితా సంపుటి)
4. మోదుగు పూలు 1993
   (సామాజిక వ్యాసాలు)
5. కిన్నెర మెట్లు 2000
   (జానపద పరిశోధక వ్యాసాలు)
6. సూక్తి సుధ 2006
   (టీకరణ వివరణ 116 ప్రసిద్ధ శ్లోకాలు)
7. శెలిమె 2006
   (పరిశోధక వ్యాసాలు)

***